వీరనారి

# అరుణాసఫాలీ.



గ్రంథకర్త:

గోపరాజు వెంకటానందం



పబ్లిషర్సు;

పశుపులేటి బాపిరాజు

శ్రీసత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్,

రాజమండ్రి.



వెల 0-8-0

## అంకితం

అరుణవంటి విప్లవ వీరనారీమణులను గన్న—

# ★ వీరమాతలకు ★

## ఈ గ్రంథరచనకు తోడ్పడిన పత్రికలు.

1. ఆంధ్ర పత్రిక.
2. ఆంధ్ర ప్రభ.
3. ఇండియన్ ఎక్స్‌ప్రెస్.

శ్రీనివాసా ప్రెస్, రాజమండ్రి. 20-7-1946 తా. 1000 ఖు.

# గ్రంథకర్తలు.

శ్రీగోపరాజు వెంకటానందంగారి జననం ది19-2-1919 వ్యగ్రామం నిడదవోలు. ఉత్సాహముగల యువకులు. వీరు గ్రంథాలయోద్యమంలో రెండు సంవత్సరాలు, హరిజనోద్యమంలో సుమారు ఆరు సంవత్సరాలు పనిచేసిరి. నిడదవోలులో పట్టణయువజన సంఘమును స్థాపించి, దానికి చాల కాలము కార్యదర్శిగా పనిచేసిరి. యువజన సంఘం తరపున "యువజన్" అను వారపత్రికను పెట్టి చాలకాలము దానికి సంపాదకులుగానుండిరి.

వీరు పత్రికలద్వారా ఆంధ్రలోకానికి చిరపరిచయులే. ఆంధ్రదేశంలోని సుప్రసిద్ధ పత్రికారచయితలలో వీరొకరు. ప్రస్తుతం ఆంధ్రప్రభ, ఇండియన్ ఎక్సుప్రెస్ పత్రికా విలేఖరులు. పత్రికారచయిత హోదాలో వీరు అనేకమంది అఖిలభారత నాయకులతో యింటర్వ్యూలు జరిపారు.

వీరు యిదివరలో చాలగ్రంథములురచించి ఆంధ్రలోకాని కర్పించారు. వీరు వ్రాసిన "ప్రపంచవీరులు" కాశీ హిందూవిశ్వవిద్యాలయంలో మెట్రిక్యులేషను పరీక్షకు పాఠగ్రంథంగాకూడా పెట్టారు. వీరురచించిన గాంధీమహాత్ముని జీవితం డాక్టరు పట్టాభివంటి ప్రముఖుల మన్నలను పొందింది. సామ్యవాదభావాలుగల చక్కనిరచయిత.

"పల్లిమర్రు"

# ముందు మాట.

తలచుకొంటే స్త్రీలు పురుషులవలె ప్రతికార్యమును సాధించగలరు. మదితల్ నేర్వరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్" అన్న కవివాక్కు సార్థకముచేయు శక్తిస్త్రీలలో యుంది.

భారత దేశదాస్య విముక్తికి, స్వాతంత్ర్యరథముపై పురుషులతో బాటు స్త్రీలుకూడా తమ చేయినివేస్తేగాని స్వాతంత్ర్యరథం ముందుకు సాగలేదు. ఈనగ్నసత్యాన్ని మననాయకుడు గాంధీమహాత్ముడు ఏనాడో గ్రహించి మనకు తెలియజెప్పాడు. సృష్టిరహస్యమంతా స్త్రీలో మూర్తీభవించియుంది. అట్టి మహత్తర శక్తిగల స్త్రీని పురుషుడు అశ్రద్ధ చేయలేడు. దేశాభ్యుదయానికి పురుషుడు ఎంత అవసరమో స్త్రీ కూడా అంతే అవసరము. పరమ పవిత్రశక్తిమూర్తి స్త్రీ అంటే.

స్త్రీలలోకూడా తపస్వినులు, రాజ్యము లేలినవారు, యుద్ధములు, చేసినవారు యున్నారు. స్వాతంత్ర్యరంగములో నిఖరికి శత్రువులను ఢీకొన్న వారున్నారు. విప్లవములలో పాల్గొని వీరావేశంతో పరప్రభుత్వాలను కూలద్రోసినవారున్నారు. అట్టివిప్లవనారీమణులలో ఒకరైన స్త్రీమూర్తి అపర ఝాన్సీయైన అరుణాసఫాలీ జీవితం యిది.

# వీరనారి

# అరుణాసఫాలి

[illegible]ద్రోక మహోద్యమం. ఆమహోద్యమంలో స్త్రీలు, పురుషులు, యువకులు, విద్యార్థులు ఎంతో ఉద్రేకంతో పాల్గొన్నారు. ఆరోజులలో ఆమహోద్యమాన్ని ఎదుర్కొనడానికి ప్రభుత్వం అనేకరకాల ఆయుధాలు ఉపయోగించింది. నిరాయుధులైన ప్రజలపై ప్రభుత్వం ఆనాడు నిప్పులవర్షం కురిపించింది. ఆమారణహోమంలో ఏఏవీరాధివీరులు భూగర్భంలో కలిసిపోయారో కూడా గుర్తుపట్టుట దుర్లభం. ఏప్రజాఉద్యమానికైనా అజ్ఞాతంగా ఆహుతియైపోయి కాలగర్భంలో కలిసినవారే పునాదిరాళ్లు కాగల్గుతారు.

## నేటిఝాన్సీ

1857 సిపాయి విప్లవం తర్వాత ప్రభుత్వాన్ని ప్రత్యక్షంగా ఎదుర్కొని పోరాడిన విప్లవం 1942 ఆగస్టు విప్లవమే. ఆగస్టు 8 వ తేదీన ప్రభుత్వం నాయకులను బంధించి బందిఖానాలలో పెట్టింది. ఆమరునాడు ఆగస్టు 9వ తేదీని ప్రభుత్వచర్యను కఠినంగా విమర్శిస్తూ, కాంగ్రెసు మహాసభావర

ణలో జండాప్రతిష్ఠాపనచేసి ఉపన్యసించి, కాంగ్రెసు ప్రతిష్ఠను, ప్రజలపరువును, భారతమాత గౌరవమును కాపాడగల్గింది ఒక వీరనారి—అబల—ఆవీరయువతీమణియే అరుణానఫాలీ.

ఈవీరనారి ప్రభుత్వాధికార్లుచేతులకు బలియైయుండాలి—లేకపోతే ఎక్కడో అజ్ఞాతంగా దేశాంతరస్థమయియుండాలి—నిజంగా ఆమె బ్రతికేయుంటే నిర్మలజీవితం గడుపుతూయుండలేదు. ఆమెయేగనుక జీవించియుంటే తప్పనిసరిగా ఈసరికి ప్రభుత్వం పట్టియుండాలి.

ఆమె అజ్ఞాతజీవితమే కనుక గడుపుతూ ప్రభుత్వబలాన్ని ధిక్కొంటూఉంటే, కనీసం దేశభక్తులయిన కొందరికయినా ఆమె అడుగుజాడలు తెలిసితీరాలి" ఇవన్నీ ఆనాడు ప్రజలహృదయాలలో అరుణనుగురించి లేచిన ఆలోచనలు దేశనాయకుల అగ్రశ్రేణిలో నిలబడి, దేశస్వాతంత్ర్యం కొరకు కారాగారవాసియై, ఆరోగ్యంచెడినా, ప్రభుత్వం బందిఖానాలో వారి అతిథిగాయుంటూ కాలంగడుపుతూన్న అఖిలభారత కాంగ్రెసు కార్యవర్గసభ్యుడు అసఫాలీ చెరనుండి, వచ్చి, "నా అరుణ ఏదియని" ప్రశ్నిస్తే, ఏమిసమాధానమిచ్చేది యని దేశభక్తులంతా తల్లడిల్లారు.

భారతప్రభుత్వ హోంశాఖాకార్యదర్శి టాటన్ హాం, "ఆగస్టు అల్లరులకు కాంగ్రెసు జవాబ్ దారీ" అనే కరపత్రంలో అరుణ అసఫాలీ చర్యలనుగురించి వ్రాస్తూ "ఒక కాం

గ్రెసు వర్కింగుకమిటీ సభ్యునిభార్య విధ్వంసక ఉద్యమాన్ని నడిపిస్తూ వచ్చింది" అని వ్రాసెను, ఈకరపత్రంలో ఈవా క్యం చూచినంతనే, ప్రజలు, అరుణ అసఫాలీ తప్పక బ్రతికి యుందని గ్రహించగలిగారు. అంతేకాదు—ఆగస్టు స్వాతం త్ర్యోద్యమంలో ప్రధానపాత్ర నిర్వహించి నడుపగలుగు తోందని కూడా విని సంతోషించారు, ప్రభుత్వం ప్రకటిం చిన ఈకరపత్రానికి బదులుగా అరుణఅసఫాలీ వైస్రాయ్ లిన్‌లిత్ గో నుద్దేశించి ఒక "బహిరంగలేఖ" ప్రకటించింది. ఇట్టివీరనారీమణి అరుణను "నేటిఝాన్సీ" అనడంలో వింత ఏమి యుంటుంది.

## విద్యాభ్యాసము.

ఈమె చిన్నకాలపునాటిచదువు, ఆమె లేబ్రాయపు ఊహాలుచూస్తే ఆనాటి వింతభావాల అరుణ, ఈనాటి వీర నారిఝాన్సీలా ప్రభుత్వంతో పోరాడి ప్రజల ఆదరణను ఎట్లు సంపాదించగలిగినదా! యనే ఆశ్చర్యం వేస్తుంది.

14 ఏండ్ల వయస్సులో అరుణ తల్లిదండ్రులు ఆమెను లాహోరులోని రోమన్ కాథలిక్కుస్కూలులో చేర్పించారు. ఈమె చదువులో అందరిమన్ననలను పొందసాగింది. అరుణ లో, రోమను కాథలికు గురువుల ఏసుక్రీస్తు బోధలు విని తానుకూడా ఒకమతప్రచారకురాలుగా తయారు కావలెననే తలంపు కలిగింది. ఈవిషయం తనతల్లిదండ్రులకు తెలియగానే ఆమెను గట్టిగా మందలించి, ఆస్కూలుచదువుకు స్వస్తి

చెప్పించారు. తర్వాత అరుణను, ఆమె సోదరి పూర్ణిమను నైనిటాల్‌లోని ప్రొటెస్టెంటు స్కూలులో జేర్పించారు.

ఈస్కూలులో కూడా వీరిని జేర్పించడం అరుణతండ్రి కిష్టంలేదు. కాని తనస్నేహితుడైన మోతీలాల్ నెహ్రూ సలహాచే, వారిరువురిని ఆస్కూలులో జేర్పించెను.

యుక్తవయస్సువచ్చిన అరుణకు ఆమె తల్లిదండ్రులు వివాహముచేయ తలబెట్టారు, కాని ఆమె అంగీకరించలేదు. తనకున్న విద్య నాధారంగాజేసుకొని, ఎక్కడైనా ఉద్యోగము చేస్తూ స్వతంత్రజీవనముచేయ సంకల్పించింది, వెంటనే కలకత్తావెళ్లి, గోఖలే మెమోరియల్ బాలికాపాఠశాల ఉపాధ్యాయురాలుగాజేరి పనిచేయసాగింది. తనవృత్తి ధర్మంతో సంపాదించిన, ఆదాయమును జాగ్రత్తచేసుకొంటూ, కలకత్తాలో సాంఘికసేవద్వారా ప్రజలమన్ననలను పొందుతూ, ఉన్నతవిద్యాభ్యాసంకొరకు ఇంగ్లండుకూడా వెళ్ళనిశ్చయించింది. అరుణ యిక్కడ తనఉపాధ్యాయవృత్తిద్వారా అధికారులయొక్కయు, బాలికలయొక్కయు మన్ననలను బడసెను.

## అసఫాలీతో పరిచయం

ఈమెసోదరి పూర్ణిమ అలహాబాదులోని ఔనర్జీని వివాహమాడింది. అరుణకు స్కూలుసెలవులు వచ్చినప్పుడల్లా అలహాబాదులోని తనచెల్లెలు యింటిలో కాలక్షేపం చేస్తూయుండెడిది.

ఘటన అంటే అదేకాబోలు బెనర్జీకి ప్రియమిత్రుడు అనపాలీ మంచిఅందగాడు. అప్పటికే దేశం లోని జాతీయనాయకుడుగా అనపాలీపేరొందెను. న్యాయవాదవృత్తిలోమంచి పేరుప్రఖ్యాతులుసంపాదించెను. ఉర్దూ, పర్షియన్ భాషలలో మంచికవిత్వం కూడావ్రాయగలడు.

ఆసమయంలో కలకత్తాలోజరిగిన అఖిలభారత ముస్లింలీగుమహాసభకుహాజరై. తిరిగివస్తూ స్నేహితుడు బెనర్జీనిచూచుటకుహాలహాబాదువచ్చెను. ఆతని ఆనాటిరాకయేఅనపాలీ అరుణలదాంపత్యమునకు మార్గమయ్యెను.

## వివాహం

అరుణతల్లిదండ్రులు సుప్రసిద్ధహిందూ కుటుంబము గంగూలీవంశానికి చెందినవారుమీాదు మిక్కిలి సంస్కారానికి సాహసంలేనిసనాతనకుటుంబీకులనికూడా చెప్పవచ్చు. ఆనాటి అరుణభావాలు వారికి విపరీతంగా కన్పించాయి. దీనికి కారణము ఈమె అభ్యసించినపాశ్చాత్య విద్యయని కూడా తలచారు.

ఇంక—అరుణకు స్వతంత్రాలోచనశక్తి—స్వతంత్రభావోద్రేకము, దానితోపాటుస్వతంత్రకార్య దక్షతకూడా యున్నాయి. ఎదుటివారు చెప్పినదానికంటే, తానేస్వతంత్రబుద్ధితో ఆలోచించి, కార్యాచరణకు పూనుకొంటుంది. ఈమె విద్యకు స్వస్తిచెప్పి కాలేజీనుండి యువతలకులాగానే, కేవలం పాశ్చాత్యనారీమణిలా తయ్యా

రైంది. దుస్తులలోనేగాదు—తన తలంపులలోకూడా. ఆనాటి ఆమెకున్న పాశ్చాత్య వ్యామోహాత చూచినట్లయితే, ఆఅరుణయేనా, ఈభారతస్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నఅరుణ—అనే ఆశ్చర్యంవేస్తుంది అరుణ అనుకొన్న వివాహానికి ఆమె తలిదండ్రులు, బంధువులు కండ్డ్రజేశారు. అనేకరకాల ఆటంకాలు కలుగజేశారు. హిందూయువతి మహమ్మదీయుని పెండ్లాడడం తగదనిహెచ్చరించారు, అయితేమి—వారినంకల్పబలానికి వారినెదురొన్నవారెవరు నిలవలేకపోయారు. అరుణ—అసఫాలీ కోర్కెలప్రకారం వివాహం ప్రశాంతంగా జరిగిపోయింది. వివాహసమయానికి అరుణకు 18 ఏండ్లు. అసఫాలీకి 41 ఏండ్లు.

## శాసనోల్లంఘనోద్యమం

తర్వాత 1930 ఫిబ్రివరి 15వ తేదీని అఖిల భారత కాంగ్రెసుకమిటీ సమావేశమై మహాత్ముని అనుమతి ప్రకారం శాసనోల్లంఘనం సాగించుటకు తీర్మానించింది. శాసనోల్లంఘనం చేయుటకో పూర్వము కాంగ్రెసు అభిప్రాయము, తీర్మానము, కార్యక్రమములనుగురించి, అప్పట్లో వైస్రాయియగు యిర్విన ప్రభువుకు తెలియపరుస్తూ, మహాత్ముడు మార్చి4వ తేదీని లేఖవ్రాసి12దేదీనినత్యాగ్రహము ప్రారంభించెను.1930 ఏప్రిల్ 6వ తేదీని గాంధీజీ ఉప్పుశాసనమును ధిక్కరించి ప్రభుత్వధాటీనిఎదుర్కొనెను. 1931మేకవ తేదీని ప్రపంచశాంతికి భం

గముకలుగచేయుచున్నాడనే కారణంచేత ప్రభుత్వము మహా త్ముని అరెస్టుచేసింది. తర్వాత కొలది మాసములకే విడుదలజే సింది. తిరిగి రౌండు టేబిలు సమావేశమునకు ఇంగ్లండువెళ్ళి మ హాత్ముడు ఇండియాకు రాగానే, ప్రభుత్వము మహాత్ముని తిరిగిఅరెస్టుజేసెను.

ఈ 1930, 32 శాసనోల్లంఘనోద్యమములలో అరుణ కూడా పాల్గొని జైలునకేగెను. అరుణకు ముందుగనే అస ఫాలీ అరెస్టయ్యాడు. అప్పటికి అరుణకు సత్యాగ్రహోద్య మాన్నిగురించి నిర్దిష్టమైన అభిప్రాయాలు విశ్వాసం లేక పోయినా, భర్తఅడుగు జాడల ననుసరించడమే తన విధి యని తలచింది. దేశం నలుప్రక్కలా చూచింది. గాంధీ మహాత్ముని సందేశము ననుసరించి వేలకువేలు ప్రజలు స్వాతంత్ర్య రంగమునకురికి, ప్రభుత్వము చేయుచున్న లాటీ చార్జీల నెదుర్కొంటూ, బందిఖానాలకు బయలుదేరుతు న్నారు. ఒకమూల విద్యార్థులు స్కూళ్లకు, కాలేజీలకుస్వస్తి చెప్పి సత్యాగ్రహోద్యమంలో దూకుతున్నారు. మరొక మూల స్త్రీలు, గర్భిణులుకూడా ఘోషాగడపలు దాటి, శాస నోల్లంఘనముచేసి గాంధీమహాత్ముని సందేశమును కాపాడ డమే తమ విధిగా తలచి కారాగారాలకు పయనమవు తున్నారు. దేశంలో ప్రస్ఫుటమైన చైతన్యం కలిగింది. అనేకరకాలుగా ప్రభుత్వ శాసనాలను లక్ష్యపెట్టకుండా సత్యాగ్రహాలు, స్వేచ్ఛగా తాము సత్యమని నమ్మినదానిని

ప్రజలమధ్య ప్రచారం చేయసాగారు. ఇంతటి ఉద్యమాన్ని తన కండ్లతో చూస్తూ అరుణ ముస్లింని పెండ్లాడిన ఘోంషా స్త్రీవలె యింటిలో కూర్చొనలేకపోయింది. వెంటనే సత్యాగ్రహోద్రమంలో పాల్గొని ఢిల్లీలోని చాందినీచౌకులో వీరోచితమైన ఉపన్యాసం యిచ్చింది-

ప్రభుత్వం ఈమెకు ఒక సంవత్సరం శిక్ష వేసింది. ఈమె భర్త అసఫాలీకి 18 నెలలు శిక్ష విధించింది. ప్రభుత్వము అంతకు పూర్వమే. సక్రమ ప్రవర్తనకు పూచీయిస్తే అరుణను విడుదలచేస్తామని ప్రభుత్వమన్నది. కాని అరుణ అసలు "సక్రమప్రవర్తన" యనే పదాన్ని నీచంగా తలచి అందుకు నిరాకరించింది.

కొన్ని మాసములనంతరము జరిగిన గాంధీ యిర్విను ఒడంబడిక ప్రకారం కారాగారాలలోని రాజకీయ ఖైదీల నందరినీ ప్రభుత్వం విడుదల చేసింది. ప్రభుత్వం అరుణవల్ల తమకు ఏమి ముప్పు సంభవించునని తలచినదో లేక మరేందుకు చేతనోగాని, ప్రభుత్వం అందరినీ విడిచిపెట్టి అరుణను విడిచి పెట్టలేదు. ఈవిషయం లాహోరు సెంట్రలు స్త్రీలజైలులో తెలియగానే, తమకు విడుదల ఉత్తరువులైనప్పటికీ, అరుణను విడిచిపెట్టువరకు తాము జైలుగుమ్మము దాటి వెళ్ళమనిరి. ఈ విధంగా ఉదయం 6 గంటలు మొదలు సాయంత్రం 8 గంటలవరకు స్త్రీ సత్యాగ్రహులంతా పట్టుబట్టిరి. పిమ్మట గాంధీమహాత్ముడు, డాక్టరు అన్సారీ కలుగజేసుకొని,

అరుణకొరకు పట్టుబట్టక విడుదల ఉత్తరువుల నంగీకరించ వలసినదని స్త్రీ సత్యాగ్రహులకు తంతినిచ్చిరి. అప్పుడు అరుణ అసఫాలీని విడచి తాము వెళ్ళిపోయిరి. తర్వాత కొద్దిరోజులు పోయిన తర్వాత, ప్రజాందోళనను భరించలేక ప్రభుత్వం అరుణను విడిచిపెట్టింది. ఖాన్ అబ్దుల్‌గఫూర్‌ఖాను మరికొంతమంది దేశభక్తులు, ఆమెకు ఆనాడు జైలుగేటువద్ద బ్రహ్మాండమైన స్వాగతమిచ్చారు.

1932 ఉద్యమంలో ప్రభుత్వం అరుణాసఫాలీని అరెస్టు గావించి, కారాగార శిక్షవిధించి, రెండువందల రూపాయలు జరిమానాకూడా విధించింది, కాని పరప్రభుత్వం విధించిన శాసనాన్ని తాను ఎందుకు మన్నించాలి—అనే సిద్ధాంతం మీద ప్రభుత్వంతో పోరాటంసల్పే అరుణ జరిమానాను ఎట్లు చెల్లించగలదు! భారతస్త్రీకి అంగరక్షకుడు భర్త. ఆమె సర్వస్వము భర్తయే. ఆమె వహించే కష్టసుఖాలు భర్త కష్టసుఖాలలోని భాగాలు. భారతస్త్రీ పవిత్రమైన సొత్తుభర్త. ఇన్ని మాటలెందుకు? భారతస్త్రీకి "స్వ" అనేది లేకుండా సమస్తము భర్తపరం గావించి, తాను అర్థాంగి ననిపించు కొంటుంది. అందుచేత భారతస్త్రీకి అండగా నిలవగలుగు తున్నాడు భర్త. ఈ విషయాలన్ని ప్రభుత్వానికి తెలుసు. అసలు ఈబ్రిటిషుప్రభుత్వం భారతదేశంలో కాలుపెట్టిననాడే, భారతీయుల ఆచార వ్యవహారాలు అర్థం చేసుకోగలిగింది. వీరి ఆచారవ్యవహారాలకు విరితలలుపెడ్తూ అప్పుడప్పుడు

భారతీయులను రెచ్చగొడ్తూ యుండేది. 1857 సిపాయి విప్లవం అనంతరమైనా బ్రిటిషు ప్రభుత్వం భారతీయుల మత, సాంఘిక, ఆచార వ్యవహారాలును పూర్తిగా అర్థంచేసుకోగల్గింది. అందు కనే సిపాయివిప్లవం ఫలితంగా విక్టోరియా మహారాణి తాను చేసిన ప్రకటనలో, భారతీయుల మత వ్యవహారాలలో మేమిక కలుగజేసుకొనబోము అని సుస్పష్టంగా ప్రకటించింది.

ఇన్ని తెలిసిన ప్రభుత్వము అరుణపై విధించిన రెండు వందల రూపాయల జరిమానాను రాబట్టుటకు అరుణ భర్త అసఫాలియొక్క ఆస్తి వేలం వేయడమో, లేక ఆతని ధనమును జప్తుచేయడమో జరిగించడానికి బదులు, అరుణయొక్క విలువైన చీరెలను వశం చేసుకొన్నది. పరప్రభుత్వము ఒక అబలయొక్క చీరెలను స్వాధీనం చేసుకొని, తన అసమర్థతను లోకానికి వెల్లడి చేసుకొంది.

ఈ ఉద్యమం రోజులలో మొదట అరుణను ప్రభుత్వం ఢిల్లీ జైలులో బంధించింది. ఆ జైలు అధికారులు రాజకీయ ఖైదీలను చాల సంకుచిత దృష్టితో చూస్తూ, అనేక కష్టాలకు గురిచేయడం మొదలుపెట్టారు. వెంటనే అరుణ నిరాహార దీక్షావ్రతం సాగించింది—తన అసమ్మతిని తెలుపుతూ. ప్రభుత్వం ఖంగారుపడింది. రాజకీయఖైదీల కోర్కెలను ప్రభుత్వం వెంటనే నెరవేర్చింది. కాని ప్రభుత్వం వెంటనే నెరవేర్చింది. కాని ప్రభుత్వం అరుణపై పగబట్టి, ఆమెను అంబాలా జైలుకు మార్చి ఏకాంతరవాస శిక్ష విధించెను.

# ఆత్మ పరిశోధన

1932 జైలు కార్యక్రమం అరుణకు విసుగెత్తింది. జైలు కటకటాలమధ్య బంధింపబడి యుండడం, బ్రిటిషుప్రభుత్వాన్ని భారత దేశంనుండి వెడలగొట్టడానికి ఏవిధంగా ఉపయోగ పడ్తుందో అరుణకు అర్థంకాలేదు. అందుకనే కాబోలు 1942 ఉద్యమంలో చాటున దాగి బ్రిటిషు ప్రభుత్వబలాన్ని ఎదు ర్కొంది. తా నిదివరలో జైలులో గడిపిన రోజులు తలపుకు తెచ్చుకొని దీర్ఘాలోచన సాగించింది. 1930—32 ఉద్య మాలు ప్రజలలో సంచలనం, చైతన్యం కలిగించిన మాట వాస్తవమేగాని, వాటివల్ల ప్రజలు దేశస్వాతంత్ర్యసాధనలో ఎంతవరకు ముందుకు వెళ్ళగలిగారని ఆత్మ పరిశోధన చేసు కొంటే, అరుణకు శూన్యమనే సమాధానం వచ్చింది. ఇట్టి ఉద్యమాలవల్ల తమతమ జీవితాలను జైలు కటకటాలకు బలి వేస్తే ప్రయోజనముండదని గ్రహించింది. ఆమె మనస్సు ఏదో నూతన సిద్ధాంతంకొరకు, నూతన కార్యక్రమం కొరకు పరిశోధన గావించడం మొదలుపెట్టింది.

ఆ సమయంలోనే గాంధీగారి ఆదేశానుసారంగా కారాగారాలకేగిన యువక వీరులు జయప్రకాశ్ నారాయణ, అచ్యుతపట్వర్ధన్, మసానీ, అశోకమెహతాగార్లు కూడా నూతన కార్యక్రమం కొరకు వెదకజొచ్చారు. అంతలో గాంధీగారు ఉద్యమాన్ని చాలించారనే వార్త వీరిచెవులకు

పిడుగులా వినబడింది. అంతా నిస్పృహ చెందారు. తప్పని సరిగా నూతన సిద్ధాంతాలను ప్రజలమధ్య ప్రచారం సాగించి తీరాలనే నిశ్చితాభిప్రాయానికి ఆ జైలుగోడల మధ్యనే వచ్చారు. అయితే అందరిదృష్టి సామ్యవాద సిద్ధాంతాల వైపుకు పరుగెత్తింది. కాని ఆసిద్ధాంతాలను గురించి వారి మనోవీథులలో పరుగెత్తున్న భావాలు, ఊహాలకు ఒక నిర్ణీత స్వరూపం లేకుండాయుంది. అంతవరకు ప్రజలలో సామ్యవాద భావాలు ఏమీ ప్రచారంలోనికి రాలేదు. కర్షక కార్మిక శ్రేయస్సే భారతదేశ కళ్యాణం కాగలదనే తమ నినాదాన్ని అమలుపరచడ మెట్లాయని ఆలోచించసాగారు. వెంటనే కలసి సామ్యవాద సిద్ధాంతాలను కార్యక్రమమును తయారు చేసి, వాటికి ప్రాణంపోసి ఒక నూతన స్వరూపము నివ్వ గల్గారు.

అరుణను సామ్యవాద కార్యక్రమ మాకర్షించింది. ఏనాటికైనా బానిస భారతదేశము స్వతంత్ర భారతదేశంగా కాగల్గాలంటే సామ్యవాదమే శరణ్యమని నమ్మింది. అప్పటి నుండి తిరిగి 1942 ఉద్యమంవరకు అరుణాసఫాలీ రాజకీయ రంగంలో ఎక్కువగా కన్పించలేదు. ఈ పదినంవత్సరాలు తనలోతాను స్వాతంత్ర్య సాధనకు తగిన సన్నాహాలు చేసు కొంటోంది కాబోలు. కాని ఈమె భర్త అసఫాలీ కాంగ్రెసు కార్యకలాపాలలో ఎక్కువగా పాల్గొంటూనే వచ్చాడు.

# క్విట్ ఇండియా

1942 ఏప్రిలులో క్రిప్సురాయబారం విఫలమవగానే బ్రిటిషుప్రభుత్వంతో ప్రజలంతా విసుగుజెందారు-ఈపరప్రభుత్వ దాస్యము ఏలాగైనా వదల్చుకోవాలనుకొన్నారు. ప్రజాసంస్థ యైన కాంగ్రెసు ఏమిసలహాయిస్తుందో కాంగ్రెసుకార్యవర్గము కొరకెదురుచూచారు. కార్యవర్గముగాంధీమహాత్ముని సలహాకొరకెదురుచూచింది గాంధీతనఅంతరాత్మ ఏమిచెప్పుతుందో యన్ని ఆలోచించాడు. వెంటనేగాంధీమహాత్ముని అంతర్వాణి పలికింది. భారతదేశానికి సందేశమివ్వమని గాంధీజీని ప్రోద్బల పరచింది. మౌనంవహించి, వహించి, చివరకు యిలాఅన్నాడు. "ఏమైనాసరే బ్రిటీషువారు భారతదేశంనుండి పోవాలి. అందుకుభారతీయులంతా స్వాతంత్ర్యమో- వీరస్వర్గమో తేల్చుకొని మరీకార్య రంగాని కురకండి" అన్నాడు. కాంగ్రెసు కార్యవర్గముసరేనంది. ప్రజలుగాంధీసలహాకు భలీయన్నారు.

గాంధీజీ బ్రిటీషుప్రభుత్వాన్ని అడిగి తెలుసుకొన్నాడు. ప్రారంభమైన ద్వితీయప్రపంచ సంగ్రామంలో బానిసభారత దేశం ఎందుకుపాల్గొనాలని- యుద్ధానికి ఎందుకుసహాయంచేయాలన్ని ప్రశ్నించాడు. యుద్ధానికి సహాయంచేస్తే భారతీయులకు వచ్చే ప్రతిఫలమేమిటని కాంగ్రెసుకూడా ప్రశ్నించింది.

పాసిజం వినాశనమైనంతనే ప్రజాస్వామికం సర్వప్రపంచంలో సుస్థిరంగా నెలకొనగలదు, అక్షరాజ్యాలపై విజయ్యాని

# ఆగష్టు విప్లవం

గాంధీమహాత్మునికూడా అరెస్టుచేసి ఎక్కడికో తీసికొనిపోయారు. నాయకులను బంధించిన చాలారోజుల వరకు ప్రభుత్వం వారినిఎక్కడయుంచిందోకూడా ప్రజలకు తెలిసింది కాదు. ప్రజలుతమ నాయకులకు దూరమవగానే; దేశమందలి ప్రజలంతా ప్రభుత్వానికిలొంగక, ప్రజాఉద్యమం సాగించి ప్రభుత్వాన్ని పడగొట్టాలని ప్రయత్నించారు. కానిప్రభుత్వం ముందుగనే నిరాయుధులైన ప్రజలపైన లాఠీచార్జీ, విషవాయుప్రయోగము, తుపాకీగుండ్లవర్షము మొదలగుహింసాకార్యములు చేయగానే, ప్రజలుఉద్రేకపరులై, గాంధీమహాత్ముని "స్వాతంత్ర్యమో—వీరస్వర్గమో" అనుమంత్రమును మననం చేసుకొంటూ ప్రభుత్వ క్రూరదాడిని ఎదుర్కొని పోరాడారు. ప్రభుత్వప్రేరేపణ ఫలితంగా ప్రజ్వరిల్లిన ప్రజావిప్లవంగా పరిణమించింది ఆనాటిప్రజల తిరుగుబాటు. ఆవిప్లవాన్ని ప్రభుత్వ మారణయంత్రాలు చల్లార్చలేక పోయినవి. కానిఆవిప్లవాన్ని చల్లార్చటానికి ప్రభుత్వంఒకపని చేసియుండవలసింది. ప్రజలు ఏమహానాయకుల అరెస్టులమూలంగా మతితప్పిన వారై ఉద్రేకపరులైరో, ఆప్రజానాయకులను ప్రభుత్వం ప్రజలకిచ్చివేసినట్లయితే, తప్పక ప్రజలు శాంతము వహించి యుండెడివారు.

ఆగష్టు 8వ తేదీని ప్రభుత్వం నాయకులను అరెస్టుచేసింది. ఆఅరెస్టయిననాయకులలో అసఫాలీకూడాగలరు. అగ

ష్టురివ తేదీని అరుణాసఫాలీ అఖిలభారతకాంగ్రెసు మహాసభ జరిగిన ఆవరణలో జండాప్రతిష్టాపనజరిపి, ఆసభకు ఆతుపాకీ గుండ్ల మధ్యనే అధ్యక్షతవహించింది, ఆరోజే మొదలు ఆమె అజ్ఞాతవాసానికి ప్రారంభం. అప్పటినుండి ఆగష్టుఉద్యమంలో ఆమె ప్రధానపాత్ర వహించి జయముపొందింది.

అరుణ ఆనాడు ఈవిధంగా తలచియుండాలి. ద్వితీయ ప్రపంచ సంగ్రామంప్రారంభమయి అప్పుడేమూడుసంవత్సరాలు కావచ్చింది. భారతప్రజకు యిష్టంలేకపోయినా, బలవంతంగా ప్రభుత్వం ఈయుద్ధాన్ని భారతదేశంపైన కరూడారుద్దింది. గత ప్రపంచమహాసంగ్రామంలో భారతదేశం అంగీకరించి బ్రిటీషుప్రభుత్వానికి సహాయం చేసింది. భారతప్రజ చేసిన సహాయఫలితంగా బ్రిటీషుప్రభుత్వం విజయం సాధించింది, కాని యథాప్రకారంగానే, ప్రభుత్వం చేసినవాగ్దానాలను నెరవేర్చడానికి వెనుకాడింది.

గతప్రపంచయుద్ధ సమయంలో బానిసత్వముచే అల్లాడుఅనేకరాజ్యములు స్వతంత్ర రాజ్యములుగా నేర్పడినవి. కొన్ని వందల సంవత్సరములనుండి బానిసత్వముచే బాధపడుచున్న ఐర్లండు డీవెలరా నాయకత్వమున ఈయుద్ధసమయంలోనే తీవ్రాందోళన చేసి స్వతంత్రత బొందగలైను. ప్రపంచమునంతకును నేడుగొప్పఆదర్శమై, సామ్యవాద ప్రభుత్వమును నిరాఘాటముగా సాగించుచున్న రష్యాదేశములో ఈప్రపంచయుద్ధసమయముననే జారుప్రభుత్వధ్వంసము, సామ్యవాద

పరిభుత్వస్థాపన జరిగెను. ఈసమయముననే తురుష్కజాతియో ద్ధారకుడగు ముస్తఫా కెమాల్ పాషా నాయకత్వమున టర్కీదేశములో స్వాతంత్ర్యముసుస్థాపిత మైనది. ఈసమయముననే మసారిక్ నాయకత్వంకిరింద జెకోస్లోవికియాదేశము స్వాతంత్ర్యము పొందగల్గింది.

ఇన్నిరాజ్యాలు యుద్ధసమయంలో స్వతంత్రిత పొందగల్గినప్పుడు భారతదేశం పరిభుత్వానికి సహాయపడికూడా స్వతంత్రిత పొందలేకపోయింది. భారతదేశం స్వరాజ్యం పొందవలెనంటే, యుద్ధకాలమే మంచిసమయం- ఈయుద్ధసమయంలో బిరిటీషుపరిభుత్వానికి సహాయపడకుండా, సామారిజ్యవ్యతిరేకశక్తులను ఎంత పోరిద్బలపరిస్తే అంతసత్వరంగా స్వరాజ్యం పొందగలము.' అనిఅరుణ ఆనాడు ఆలోచించింది.

---

## అజ్ఞాతవాసం.

నాయకత్వంలేకుండా అల్లాడుతున్నపరిజలకు మార్గం చూపించి, ఆగష్టుఉద్యమాన్ని జయప్రదంగా కొనసాగించడానికి అరుణాప్రయత్నించింది. రహస్యంగా దాగుకొని ప్రభుత్వంతో దాగుడుమూతలాడింది. ప్రభుత్వాధికారుల కండ్లను అనేకమార్లు కప్పి తూరీగలా తప్పించుకోగల్గింది. రహస్యోద్యమరోజులలో ప్రభుత్వంతో విచిత్రంగా పోరాడుతూ, వారి

కెప్పుడూ ఏవో ఆటంకాలు కలుగజేస్తూనేయుంది. విప్లవమార్గాలను వెదకుతూ ప్రజలను ఉద్రిక్తపరుస్తూనేయుంది. ఆరోజులలో ప్రభుత్వానికి ఈమె ఒక పెద్దసమస్య అయింది. సామ్రాజ్యాలేలనలెనని ఉవ్విళ్లూరుచున్న బ్రిటీషుప్రభుత్వాధికారులు ఒక ఆడదానిని పట్టుకోనలేక, ఒక అబలయొక్క విప్లవకార్యములను అరికట్టలేక, "అరుణను పట్టిచ్చినవారికి అయిదువేల రూపాయలు బహుమానమిచ్చెదమని ప్రకటించారు.

1857 సిపాయివిప్లవంలో ఝాన్సీరాణి విప్లవమూర్తివలె విజృంభించి, బ్రిటీషుప్రభుత్వమును ఎదిరించింది. 1942 ప్రజావిప్లవంలో వీరనారిఅరుణ రహస్యోద్యమం ద్వారా ప్రభుత్వమును ఎదుర్కొని, భారతదేశంనుండి తరిమివేయ ప్రయత్నించింది.

ఈరహస్యోద్యమంలో అరుణాసఫాలీకి సహచరులుగాయుంటూ ఆమెతోబాటు విప్లవకార్యాలలో పాల్గొన్నవారు మరికొంతమందియున్నారు. వారిలోముఖ్యులు జయప్రకాశనారాయణ, రామమనోహరలోహియా, అచ్యుతపట్వర్ధన్, ఉషామెహతాగార్లు. వీరురహస్యోద్యమంలో ముఖ్యమైన కార్యకలాపములు—రహస్య రేడియోద్వారా ఉద్యమవార్తలను ప్రచారంచేయడము, క్విట్ ఇండియా, పత్రికద్వారా ప్రజలఉత్సాహ ఉద్రేకాలు సడలకుండా ప్రయత్నించడము, ప్రభుత్వయుద్ధ ప్రయత్నాలకు శక్తికొలది అడ్డంకులు కలిగించడం మొదలగు విప్లవకార్యములు చేసెడివారు.

తుదకు ప్రభుత్వం అరుణను పట్టుకోనలేక విసుగుజెంది, "ఢిల్లీలో స్వగృహందాటి వెలుపలికిపోకుండావుండే షరతుపై ఆమెపైగల అరెస్టు ఉత్తరువులను ఉపసంహరించ గలమని" ప్రభుత్వము ప్రతిపాదించగా, ఆమె ఇండియాలో ఒకచోట నుంచి, ప్రభుత్వానికి సమాధానమిస్తూ. "ఈప్రతిపాదనచేసి నన్ను మీరవమానించారు" అని నిర్మొగమాటంగా చెప్పినట్లు గా దేశంలో వదంతిబయలుదేరింది.

లక్నో జయిలులో 12 రోజులు నిరాహారవ్రతం పూని యున్న కాకోరీకుట్రకేసు ఖైదీ జోగేశ్చంద్రచాటర్జీస్థితినిగూర్చి తనఆదుర్దాను తెలుపుతూ, అరుణాసఫాలీ ఎక్కడనుండో ఒక వుత్తరంవ్రాసిందని కలకత్తాలో జరిగిన ఒకబహిరంగసభలో సభానిర్వాహకులు ఆలేఖనుచదివి, "చటర్జీకోర్కెలను తృప్తి పరచి ఆయనప్రాణాన్ని కాపాడాలని అధికారులను కోరుతూ" తీర్మానించారు.

అరుణను పట్టుకోనడానికి ప్రభుత్వానికి వేరొకగత్యంతరము లేకపోయింది. ఆమెపై ప్రభుత్వము జారీచేసినవారంట్లు రెండుచార్జీలపైన ఆధారపడీయున్నవి. ఒకటి ఆమెస్వదస్తూరీతో బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా యున్నవిషయాలు వ్రాసి వ్యాపింపజేసిందని; రెండవది—పదిరోజులలో ఆమె పోలీసువారివశము కావలెనని చేసినఆజ్ఞలను ధిక్కరించిందనీ.

తుదకుప్రభుత్వము, నాలుగువేలరూపాయలు ఖరీదుచేసే ఆమెకారును వేలంవేశారు. ఇరవైవేలు ఖరీదుచేసే ఆమె

ఇల్లువదిల్లి పోశారు వచ్చినసొమ్మును గవర్నమెంటు ఖజానాకు జమకట్టుకున్నారు. రాజుతలచుకుంటే దెబ్బలకేమికొదవ!

ప్రభుత్వము వారు పట్టుకొనలేకపోయారుగాని అరుణాసఫాలీ దేశమంతా రహస్యంగా సంచారము చేస్తూనేయుంది. లాహోరులోని "వీరభారత్" అనే పత్రిక అరుణాసఫాలి అజ్ఞాతవాస సంచారాన్ని గురించి, ఈవిధంగా వ్రాసింది.

"లాహోరుహైకోర్టులో అజాద్‌హింద్‌ఫౌజు వీరుడు బుర్హానుద్దీన్ కేసు విచారణకు వచ్చినప్పుడు ఆమె అక్కడకు వచ్చింది. అక్కడకొద్దిరోజులుండి పెషావరు వెళ్ళింది. అక్కడ నుంచి కలకత్తావచ్చింది. సిమ్లా కాన్ఫరెన్సు సమయంలో సిమ్లాలోను, అఖిలభారత కాంగ్రెసుకమిటీమీటింగు సమయంలో బొంబాయిలోను, కలకత్తాలో జరిగిన కాంగ్రెసు కార్యవర్గ సమావేశ సమయంలో కలకత్తాలోనుయుంది. ఈమూడు చోట్లకూడా సి. ఐ. డి. పోలీసులు ఈమెను పట్టుకొనుటకు ప్రయత్నించి విఫలులయ్యారు. అఖిలభారత కాంగ్రెసు కమిటీ మీటింగు సమయమున ఆమెబొంబాయితోయున్నట్లు పోలీసులకు తెలిసీకూడా పట్టుకొనలేకపోయారు. ఒకప్పుడామె కలకత్తాలో జయప్రకాశనారాయణతో ఉండగా పోలీసులు ఆచూకీతీసి ఆమెను అరెస్టుచేయడానికై పోగా, అప్పటికప్పుడే తప్పించుకుపోయింది.

ఈపత్రిక వ్రాసిన పైవిషయాలు చాలామందికి ఆశ్చర్యం

కలిగించాయి. పత్రికలు అనేకవిధాల అరుణ ధైర్యసాహసాలను కొనియాడరు.

అరుణ అజ్ఞాతవాసంలో అనేక కష్టాల నెదుర్కొనవలసివచ్చింది. ప్రభుత్వం ఆమె ఆస్తిపాస్తులను వశంచేసుకోవడం, ఆమెను పులిని వెంటాడినట్లు వెంటాడడం అలావుండగా, అజ్ఞాతవాస సమయంలోనే ఈవీరనారి తనమాతృదేవతను గోల్పోయింది. ఇన్నికష్టాలు ఆమెకు కల్గినా, కొంచమైనా చలించక, దేశస్వాతంత్ర్యసాధనకు కంకణం కట్టుకొని పనిచేసింది.

అజ్ఞాతవాస జీవితమంటే అనుకున్నంత సులభంకాదు. చాల మెలకువతో శత్రువులకంట బడకుండా యుండాలి. ఒకసారి అరుణను బట్టవలెనని పోలీసులు కుట్రపన్నిరి. అరుణకీవిషయం తెలిసింది. తప్పించుకొనుటకు ఏమీ దారికనిపించలేదు. అంతలో ఒక పత్రికలో ఒక ఇంగ్లీషు కుటుంబము వారు ఒక ఆంగ్లయువతి తమ అతిథిగా కావలెనని ప్రకటన చేశారు. అరుణ అదిచూచి వెంటనే టాక్సీలో అక్కడకు బయలుదేరి వారి ఆతిథ్యము బొంది, తాత్కాలిక చిక్కును తప్పించుకోగల్గింది.

మరొకమారు గ్రహణీవిరోచనములతో బాధపడుతూ ఒకరియింటిలో యుండగా, అక్కడ ఒకపోలీసు అధికారిని కలుసుకొనుట సంభవించింది. కాని అక్కడకూడా అతని కళ్ళలో దుమ్ముకొట్టగల్గింది.

# కాంగ్రెసు అధ్యక్షునికి లేఖ

అరుణ సాంకేతిక వాసంలోనుండి కాంగ్రెసు కార్యవర్గానికి రాష్ట్రపతి అబుల్ కలాం అజాద్ పేరిట ఒక లేఖ వ్రాసింది. ఈలేఖ అరుణాసఫాలీ ఒక్కతెయే వ్రాసినది కాదు. కాంగ్రెసు సోషలిస్టునాయకుడు అచ్యుతపట్వర్ధను, అరుణాసఫాలీ కలిసి వ్రాశారు.

నాయకుల అరెస్టు అనంతరం దేశంలో బ్రిటిషు నిర్బంధ విధానం ఆవరించియున్న రోజులలో నాయకులకొరకు బెంగటిల్లిన ప్రజలకు ఒక నిర్మాణమైన నిర్దిష్టకార్యక్రమము నొకదానినిచ్చి, ఆగస్టు విప్లవ వాయువులు చల్లారకుండా, అ. భా. కాంగ్రెసు మహాసభలో నాయకులు ఉపన్యాసాలద్వారా ప్రజలలో కలుగజేసిన ఉద్రేకమును చావనివ్వకుండా, అరుణ అచ్యుత్‌లు నాయకత్వం వహించి, ప్రజలను స్వాతంత్ర్యరణరంగంలో ముందడుగు వేయించగల్గారు. తాముచేసిన ఈకార్యమునకు బాధ్యత తమదేనంటూ, తామాచరించిన మార్గం సరియైనదేనంటూ, ప్రస్తుత కాంగ్రెసు కార్యవర్గధోరణిమాత్రము నాటి ఆగస్టు తీర్మానానికీ ఆగస్టువిప్లవానికి దూరమవుతోందని నిర్భయంగా అచ్యుత్ అరుణాసఫాలీలు తమ ఉత్తరంలో వ్రాశారు.

మనగమ్యస్థానం సత్యం, అహింసలద్వారా స్వరాజ్యమును సాధించడమే. కాని మనశత్రువులు మనగమ్యస్థానం

చేరుకోవడానికి చేసే ప్రయత్నాలలో ఆటంకాలు కల్పించి, అవమానాల పాలుచేస్తే, అవన్నీ సహించి ఊరుకోవడమేనా? భీరువులమై పిరికిపందలవలె పారిపోవుటకంటె, ఆత్మరక్షణ కొరకైనా నిలిచి పోరాడవ మవసరం కాదా! మనశత్రువుల ఘాతుక హింసాచర్యలకు మనం బలియైపోతే, మనఆశయాలు మట్టిలో మాయమైపోవా? అకారణంగా ఒక మారణయంత్రానికి మనప్రాణం సమర్పించడంకంటె, మనంనిలిచి సాధ్యమైనంతవరకు శత్రువును ఎదుర్కొట మంచిదికాదా! ఇదే కదా! గాంధీమహాత్ముడుకూడా చెప్పినది హిట్లరు పోలండుపై దండయాత్ర సల్పినప్పుడు ప్రజలు మారణయంత్రాలమ్రోతలకు పారిపోకుండా ధైర్యంగా శత్రువును ఎదుర్కోవాలని. చెప్పలేదా? అంతవరకు ఎందుకు? కాంగ్రెసు కార్యవర్గమే తమ ఆగస్టు తీర్మానంలో, "ఎవరుపైకి ఎత్తివచ్చినా నిరోధించవలసిందే. లొంగిపోతే భారతీయులు భ్రష్టులై, దాస్యం చేస్తున్నట్లే" అని ఉద్ఘాటించారుకదా! గాంధీజీ, కార్యవర్గము చెప్పిందే మేము చేశాము. అంతమాత్రంచేత, "ప్రజలకు దారిచూపే నాధుడులేక పోవడంచేత యించుమించుగా తమకు తోచినరీతిని ప్రవర్తించారని" అహింసావ్రతానికి భంగంకలిగిందని కాంగ్రెసునాయకులు విడుదలానంతరము కాంగ్రెసు కార్యవర్గము కలకత్తాలో సమావేశమైచేసిన తీర్మానంలో ఏమా అర్థంకల్పించవలెను. ప్రభుత్వం కాంగ్రెసు నాయకులను బంధించినతర్వాత, వివిధ రాష్ట్రాలనుండి కాంగ్రెసులో బాధ్య

తెగలవదవులలో నున్నవారు 12 మందిబొంబాయిలో సమావేశమై ఉద్యమానికి రూపురేఖలిచ్చి, ప్రజలను అజ్ఞానాంధకారమునుండి తొలగించి సత్యమైన స్వాతంత్ర్యమార్గము చూపించగల్గారు.

కాంగ్రెసు కార్యవర్గము అవలంబిస్తున్న పార్లమెంటరీ కార్యవిధానము చాల అసంతృప్తిగాయుంది. పార్లమెంటరీ ప్రోగ్రాము కాంగ్రెసును తోకలాగ ఆడిస్తోంది. ఇప్పుడు కాంగ్రెసు పెద్దలంతా పార్లమెంటరీ కార్యక్రమంలో నిమగ్నమైపోయి విప్లవచైతన్యం కలిగించే ఆగస్టు తీర్మానాన్ని మరుస్తున్నారు. పార్లమెంటరీ కార్యక్రమానికి కాంగ్రెసు నాయకులు నేడు యిస్తున్న ప్రాముఖ్యత ఆగస్టు తీర్మానానికివ్వడం లేదు. కాంగ్రెసువారు బ్రిటిషువారితో పడే రాజీబేరాల సందర్భంలో జిన్నానుకూడా సంతృప్తిపరచే స్థితిలోకి దిగగలరనడంలో ఏమీ సందేహంలేదని గోచరిస్తోంది! అనే విషయాలను చర్చిస్తూ అరుణా ఆసఫాలీ, అచ్యుతపట్వర్ధన్ గార్లు తమ లేఖలో నిష్కపటంగా వ్రాసి ఆ లేఖను కాంగ్రెసు అధ్యక్షునికిపంపారు.

## నిషేధాజ్ఞ రద్దు

ఇట్టి వీరనారి అరుణను బ్రిటిషుప్రభుత్వం యింక పట్టుకొనలేక విసుగుజెంది, తుదకు ఆమెపై 42 నుండియున్న అనగా నాలుగు సంవత్సరాల అనంతరము నిషేధాజ్ఞను రద్దు చేసింది.

అరుణాసఫాలీ తనపై ప్రభుత్వం నిషేధాజ్ఞను ఉపసం
హరించుకొన్నదనే విషయం విని యిలాఅన్నది.

"నిషేధాజ్ఞ రద్దు చేసినందుకు పెద్దగా సంతోషించ
తగ్గది ఏమీలేదు. నాధర్మాన్ని నేనునిర్వర్తించాను. స్వాతం
త్ర్యపోరాటంలో నేను చేసింది లవలేశము. నేను పెద్ద త్యాగ
ము చేసింది ఏమీలేదు. నన్ను పొగడవలసిన పనిలేదు. స్తోత్ర
పాఠాలకిది సమయంకాదు. కొద్ది కొద్ది మందిని ప్రభుత్వం
విడుదలచేయడంలో మహోదాత్త పరివర్తనం ఏమీలేదు.
దీనివల్ల అసలు పద్ధతిలో మార్పు ఏమీన్నీ కనిపించడంలేదు.
ఇంకా రహస్యంగా యున్నవారిని గురించే నామనస్సు బాధ
పడుతూఉంది. వారంట్లు రద్దు అయిపోయినందువల్ల నేను
చేయదలచుకొన్న పని కొంచెం సులభం కావచ్చును. ఇంత
కాలము నాచేతనైనపని చేస్తూనేవచ్చాను. అయితే ఇప్పుడు
యింకా స్వేచ్ఛగా తిరిగి పని చేయడానికి వీలవుతుంది. ఇంతే
భేదము. ఇంతవరకు కందకములోయుండిపనిచేశాను. ఇప్పుడు
బయటికి వచ్చాను.

అరుణయొక్క ఈపై వాక్యాలలో ఎంతో నిరాడంబ
రత తొణికసలాడుతోంది. ఈ పలుకులు ఆమె సహజ సౌశీ
ల్యానికి, సహజ నమ్రతకు నిదర్శనం.

ఈ విప్లవమూర్తి అజ్ఞాతవాసంనుండి బయటపడగానే,
భర్తకుగాక ముందుగా గాంధీజీకి యిలా తంతినిచ్చింది. "బా
పూజీ, మీవద్దకు వచ్చి నమస్కరించేసి, మీనీడన పొందా

లని వుంది. ఎప్పుడు ఎక్కడ మీ దర్శనం చేసుకొనడానికి వీలవుతుందో తెంతెలియజేయండి.

దేశభక్తులకు, తమ కుటుంబముకంటె దేశము, ప్రజలు, ప్రజానాయకులు ప్రధానము. అరుణను అజ్ఞాతవాసంలో కాంగ్రెసు కార్యవర్గంవారు అహింసాసిద్ధాంతమును గురించి చేసిన తీర్మానం చాల బాధపెట్టింది. కాని ఆమె తనకు తానుగా ఏమి విధానాన్ని నిర్ణయించినా, తన సహచరులకు, అనుచరులకు ఎట్టి కార్యక్రమాన్ని నిర్దేశించినా, గాంధీజీ ఆశీర్వాదబలం తనకు తప్పక లభించగలదనే పరమ విశ్వాసంతోనే చేసింది. అందుకనే ఆమె అజ్ఞాతవాసంనుండి బయట పడగానే తనభర్త దర్శనంకొరకు కాక, గాంధీమహాత్ముని ఆశీర్వాదంకొరకు తహతహలాడింది. తన కోరికప్రకారం 1946 ఫిబ్రవరి 12వ తేదీ సాయంకాలసేవాగ్రాంలో గాంధీజీ ప్రార్థనానంతరం ఆయన పాదాలపై వ్రాలి ఆయనను కలుసుకొంది.

ఆమె కాంగ్రెసు కార్యవర్గాన్ని గాంధీని అవసరమైనప్పుడు విమర్శించడానికి జంకదు. కాని, వారిపై అరుణకు భక్తి విశ్వాసాలుమాత్రము మిక్కుటంగావున్నాయి. కాంగ్రెసు ఒక్కటే దేశంలోని పెద్ద రాజకీయసంస్థయనియు, ఏనాటికైనా దేశంస్వాతంత్ర్యం పొందవలెనంటే కాంగ్రెసు మహాసంస్థద్వారానే పొందవలెననియు, దేశప్రజలను నిద్రనుండి మేల్కొలిపిరాజకీయవిజ్ఞానంకలిగించిన సంస్థకాంగ్రెసేఅనియు,

కాంగ్రెసుమహాసంస్థవల్లనే భారతీయులు తమ పౌరసత్వపు హక్కునుగురించి తెలుసుకొని అందుకు పోరాడుచున్నార నియు, కాంగ్రెసే ప్రజలు, ప్రజలే కాంగ్రెసు అనియు, అట్టి కాంగ్రెసును విప్లవపూరితం చేయవలెననియు, అరుణ విశ్వాసము.

గాంధీ మానవమాత్రుడు గాడు. మహాత్ముడు. దైవాంశభూతుడు. లేనిచో ఒక్కచిక్కిన ఒక వ్యక్తి 40 కోట్ల భారతీయుల మానసికశక్తిని ఆకర్షించలేడు. గాంధీ ఒక్క భారతజాతీయ నాయకుడేగాదు. ఆయన ప్రపంచ ప్రజా నాయకుడు. అందుచేతనే ఆయనకు కావలసింది ఒక్క భారతదేశ సౌభాగ్యమేకాదు—ప్రపంచ కళ్యాణము. ఆయన ప్రపంచమందలి అన్ని దేశములవారిచేత ఆరాధింపబడుతు న్నాడు, గాంధీ,—చర్చిలు, రూజువెల్టు, లెనిను, స్టాలిను మొదలగువారివలె రాజకీయనాయకుడేగాక రామకృష్ణ పరమ హంస, వివేకానంద, రామతీర్థ, అరవింద మొదలగువారి వలె మహాయోగిపుంగవుడుకూడా. అందువల్లనే ఆయన మహాత్ముడు కాగలిగాడు. ఇట్టి ప్రపంచ మహాపురుషుడైన గాంధీమహాత్మునికి అరుణాసఫాలీ చేతులెత్తి నమస్కరిస్తుంది.

## సన్మానసభలో అరుణ ఉపన్యాసం

అరుణాసఫాలీపై నిషేధాజ్ఞ తొలగగానే కలకత్తాలో బ్రహ్మాండమగు బహిరంగసభలో ఆమెకు సన్మానం జరిగింది.

ఆసభలో అరుణ నిర్భయంగా ఒక అమూల్యమైన విప్లవ సందేశము నిచ్చింది. ఆనాటిసభలోని ఆమె విప్లవవాక్కులుకొన్ని ఉదాహరణకు దిగువపొందుపరచడమైనది.

రానున్న మూడు నెలలలో బ్రిటిషువస్తువులను పూర్తిగాబహిష్కారము చేయడమే భారతదేశం అనుసరించగల ఉత్తమకార్యక్రమం. భారత స్వాతంత్ర్య సమస్యపై రాయబారాలద్వారా, సంపూర్ణ స్వాతంత్ర్యం ఇయ్యక, మనల్ని సమాధానపర్చడానికి ప్రయత్నం జరుగవచ్చు. అట్టిది జరుగకుండా మనం జాగరూకలమై వుండాలి.

క్షామబాధచే ఈసారి ఏభారతీయుడైనా మరణిస్తే ప్రజలీసారి బాధ నివారణకేంద్రాలు ఏర్పాటుచేయక తమ ఆహారం ఎక్కడున్నదో అక్కడ కొల్లగొట్టడానికి ఉద్యమిస్తారు. స్వతంత్రమో, వీరస్వర్గమో అన్న దానిని మనంఅనుసరిస్తాం. బ్రిటిషు ఇంపీరియలిజంపై చివరిసారి గొడ్డలి పెట్టు పెట్టాలి. మనం నిర్మాణపూర్వకంగా కృషి జరపాలి. కాని, పార్లమెంటరీ రాజకీయాలవల్ల లాభం విద్యార్థులు ప్రజాసామాన్యం వాటిజోలికి పోనవసరంలేదు. శాసనసభలవంటిచోట వైస్రాయి ధర్మోపన్యాసాలు చేయగలడు. అధర్మోపన్యాసాల్ని ఇటువంటిసభలో చేయవలసినదని నేను ఛాలంజీ జేస్తున్నాను. బ్రిటిషువారు దుండగాలకు అది యీనాడుకాకపోయినా, మరియొకనాడైనా సమాధానం చెప్పక తప్పదు. మీరు, నేనుకాకపోయినా భావిప్రజానీకమైనా తమకు జరిగిన అవకాశానికి బ్రిటిషువారిపై పగసాధించక మానదు.

"చేయడమో కాక చావడమో" అనేది మహాత్మా గాంధీజీ చెప్పిన మంత్రము. ఆమంత్రమే ఇంకా నాచెవులలో గింగురెత్తుతూ ఉంది. ఆమంత్రాన్నే జీవితాంతము వరకూ అనుష్ఠించ దలచుకొన్నాను. బ్రిటీషు సామ్రాజ్య పద్ధతికి అంత్యం ఆసన్నమయింది. బహుశః అంతరించిపోయిందేమో. ఆ సామ్రాజ్యపద్ధతిని సంపూర్ణముగా నాశముచేయదలచుకొంటే శాసనసభలవల్లకాదు. ఒక గట్టిపని చేయవలసిఉంది. అట్లా చేస్తేనే ఇండో బ్రిటిషు సంబంధము తెల్లవారేసరికి తెగిపోతుంది. రాయబారాలలోనూ సంప్రదింపులలోనూ నాకునమ్మకము చాలా తక్కువ. ప్రశాంతముగా సాగించే సంప్రదింపులవల్ల ధనికస్వాములు శక్తిమంతులు అవుతారు.

కేంద్రశాసన సభలో రాజప్రతినిధి చేసిన ప్రకటనములో హిందూదేశ స్వాతంత్ర్యస్థాపనకు తేదీలు ఏమీచెప్పలేదు. ఆగస్టు ఉద్యమము జయప్రదము కాకపోయినప్పటికిన్నీ స్వాతంత్ర్య స్థాపనము ఎప్పుడు అయ్యేదిన్నీ తేదీ నేను చెప్పగలను. తేదీలు నిర్ణయము చేయడము రాజప్రతినిధి చేతులలో లేదు. సర్వసంసిద్ధమయిన భారతదేశము తేది నిర్ణయము చేయగలుగుతుంది.

ఈవంగదేశానికి క్షామము వచ్చిన రోజులలో ఒక నాడు రాత్రి కలకత్తాలో నడుస్తూ ఉండగా నాకాలికి ఏదో తగిలింది. పరికించి చూచినాను. అది మృతకళేబరము. అన్నాతురలై పట్టెడు అన్నము కోసము తహతహ లాడిన జనాన్ని

చూచినాను. ఇన్ని బియ్యముగింజల కోసము ప్రాకులాడినారు. నేతాజీ సుభాసుచంద్రబోసు బర్మానుంచి లక్షటన్నులబియ్యం పంపిస్తానన్న బ్రిటిషు గవర్నమెంటువారు అంగీకరించలేదు. ప్రజాక్షయము తప్పఘోరాక విధముగా బెంగాలులో క్షామము అంతరించడము బ్రిటిషువారికి ఇష్టము లేకపోయింది. బ్రిటిషు యుద్ధసన్నాహములు సాగడమే వారి పరమావధి. అది బెంగాలీలు గ్రహించవలెనని వారి అభిప్రాయము. ఈనాడు కాక. పోయినా ఏనాటికయినా బ్రిటిషువారు బెంగాలులో చేసిన చర్యలకు సమాధానము చెప్పవలసిఉంది.

## ఆగస్టు యోధులకు జోహారులు

ఆగస్టు ఉద్యమంలో సూత్రధారిణిగా వ్యవహరించిన అరుణాఅసఫాలీని ఉద్దేశించి, పండిత జవహర్లాలునెహ్రూ, "ప్రభుత్వదృష్టిలో అరుణ అపరాధి అయినప్పటికీ, తన ఆనందభవనములో ఆమెకుఆశ్రయ మివ్వగలనని" గొంతెత్తి నిర్భయంగా చాటాడు.

ఆగస్టు ఉద్యమాన్ని వ్యతిరేకించినవారు దేశంలో లేకపోలేదు. కాని ఆగస్టుఉద్యమం—ప్రజావిప్లవమని భారతీయుల విశ్వాసము. ఆగస్టు ఉద్యమం నిస్సందేహంగా ప్రజల మధ్యనుండి వెల్లువిరుచుకొని వచ్చినట్లుగా వచ్చింది. ఆఉద్యమంలో అరుణాసఫాలీ ప్రభృతులు అవలంబించిన మార్గము సక్రమమైనదా! అక్రమమైనదా! యని నిర్ణయించవలసినది మనంకాదు. ఈ ఉద్యమంలో తమ సర్వస్వము, తుదకు

ప్రాణములనుకూడా పణముగా పెట్టి ప్రభుత్వంతో పోరాడిన అరుణా ఆసఫాలీవంటి స్వాతంత్ర్యవీరుల ధైర్యసాహసాలను, వార వలంబించిన విధానములనుగురించి భావి చరిత్రకారులు తమ నిష్పక్షపాత, నిష్కల్మష, నిర్మలమైన కలంతో న్యాయ మాలోచించి నిర్ణయించగలరు. ఈలోగా మనం చేయవలసిన కర్తవ్యమల్లా అట్టి అగస్టుయోధులకు జోహారులు కొట్టడమే.

## భారత నావికుల తిరుగుబాటు

అరుణ తాను నమ్మిన సత్యాన్ని కుండ బ్రద్దలుకొట్టినట్లు చెప్పివేయడంలో ఎన్నడూ వెనుదీయదు.

భారతదేశంలో ముఖ్య నావికా కేంద్రాలలోని భారత నావికులు, తమను ప్రభుత్వం చాల చిన్నచూపుతో చూచుచున్నదనియు, ఆంగ్లసైనికులతో సమానంగానైనా గాకుండా చాల నీచంగా తమను చూచుచున్నదనియు మొదలుగాగల, తమ కష్టములను తెలియజేస్తూ ప్రభుత్వంపై తిరుగుబాటు జేసిరి. ఈ నావికుల తిరుగుబాటు భారతదేశము అనేగాకుండా విదేశాలలో కూడా సంచలనం గలిగించింది. ఈ తిరుగుబాటును గురించి సెంట్రలు అసెంబ్లీ కాంగ్రెసు పార్టీ నాయకుడు శరత్చంద్రబోసు "బొంబాయి, కరాచీ మొదలైనచోట్ల మంటలు మండిపోతూ ఉంటే. తాము ఇళ్ళల్లో కూర్చోజాలమని" చెప్పారు, అరుణభర్త అసఫాలీ, "భారత నౌకాదళం సందర్భంలో, సన్నిహితాధికారుల చేతకానితనం

వల్ల ఆ దళానికంతటికీ ముప్పుకలిగేరీతిని ఏర్పడిన ప్రమాద స్థితి విషయమై" చర్చించాలని సెంట్రలు అసెంబ్లీలో అడ్జర్న మెంటు తీర్మానాన్ని ప్రతిపాదించారు.

"శుద్ధ అవివేకంగా హింసాత్మకంగా జరుగుతున్న విలయ తాండవాన్ని ఆపివేయవలెనని వేడుకొంటూ గాంధీ మహాత్ముడు యిలాఅన్నాడు. నౌకాదళములో చెలరేగిన ధిక్కారమూ దాని అనంతర కలాపమూ ఏవిధముగాచూచి నప్పటికీన్నీ అహింసాత్మకమైన చర్యగాదు. అహింసాపద్ధతులవల్ల స్వరాజ్యము సాధించడమే నాసంకల్పము అని కాంగ్రెసు ముఖతః భారతీయులు వెల్లడించి చివరకు యిటువంటి క్లిష్టపరిస్థితులలోనైతేను భారతదేశము తనపద్ధతికి విరుద్ధంగా ప్రవర్తించదని లోకానికి ఋజువుచేయవలెను.

గాంధీమహాత్ముడు చేసిన పై ప్రకటనను ఖండిస్తూ, అరుణాసఫాలీ మరొకప్రకటన గావించెను. గాంధీజీ ఆమె ప్రకటించిన ప్రకటనకు సమాధానంగా, తన హరిజన్ పత్రికలో యిట్లువ్రాసెను.

"బొంబాయి సంఘటనల విషయమై నేను గావించి యుండిన ప్రకటనను శ్రీమతి అరుణాసఫాలీ ధైర్యంగా ఖండించినందుల కామె నెంతయు అభినందించుచున్నాను. కేవలము తన అభిప్రాయమును మాత్రమేగాక రహస్యముగా పనిచేయుచున్న చాలామంది సహచరుల అభిప్రాయమును కూడా ఆమె ప్రతిబింబింపజేయుచున్నది. ఈ కారణము

చేతనే ఆమెకు నేను సమాధానమొసంగుచున్నాను. ఇట్లు కాకపోయినఎడల ఆమె ఖండనమును నేను గుర్తించి యుండెడివాడనుకాదు. ఆమెఎడల నాకు పుత్రికావాత్సల్యము కలదు. నాకడుపున పుట్టకపోయినంత మాత్రముచేతను, తిరుగుబాటుదారైనంతమాత్రంచేతను, ఈపుత్రికావాత్సల్యం ఎంతమాత్రము తగ్గదు. ప్రచ్ఛన్నముగానున్న సమయమున అనేకసార్లు ఆమెను కలసికొనుభాగ్యము నాకు కలిగెను. ఆమె ధైర్యసాహసములు ఉత్కృష్టగాఢ, దేశభక్తి నాప్రశంసకు పాత్రములయ్యెను. కాని నా ప్రశంసాభావము అంతటితో ఆగిపోయెను. ఆమె రహస్యముగా పనిచేయుట నాకు యిష్టము కాకుండెను. రహస్య కార్యకలాపములకు నేను హర్షించువాడను కాను. కోటానుకోట్ల సామాన్యప్రజలు రహస్యంగా పని చేయజాలరని నేనెరుంగుదును. ఈకోటానుకోట్ల ప్రజలు రహస్యంగా పనిచేయనక్కరలేదుకూడా. రహస్య కార్యకలాపంవల్ల కోటానుకోట్ల ప్రజలకు స్వాతంత్ర్యము చేకూర్చిపెట్ట గలమని కొద్దిమంది తలపవచ్చును. ఇది ముద్దకలిపి నోటిలో పెట్టినట్లు కాదా? బహిరంగముగా సవాల్ చేయుట, బహిరంగ ముగా కార్యకలాపములు సాగించుటమాత్రమే అందరు, అనుస రించదగిన పద్ధతి. నిజమైన స్వరాజ్యము అందరికి ప్రతిపురుషు నికి, స్త్రీకి, పిల్లవానికి అనుభవములోనికి రావలెను. ఈ ఆశయ సిద్ధికి కృషిచేయుటయే నిజమైన విప్లవము. ప్రపంచమందలి పీడిత ప్రజానీకమంతటికీ భారత దేశము ఆదర్శప్రాయమైన

దేశమెందు కైనది? అక్రమముగా దేశము నాక్రమించిన దానికి హానికలుగ జేయకుండా అందరు త్యాగముచేయవలె ననికోరి బహిరంగముగాను, ఆయుధ విరహితముగాను, భారత దేశము కృషిచేయుటవల్లనే పోరాటము బహిరంగముగాను, ఆయుధ విరహితముగాను జరిగియుండనిఎడల కోట్లాను కోట్లు భారతప్రజలు ప్రబోధితులై యుండెడివారు కారు. ఋజుమార్గము నతిక్రమించినప్పుడల్లా పరిణామాత్మకమగు విప్లవమునకు తాత్కాలికావరోధము కలుగుచునేయుండెను.

## అహింస సునిశితమైన ఆయుధము

1942 సం॥పు సంఘటనల విషయమై నాభావములు మనస్వినితామణి శ్రీఅరుణాసఫాలీఅభిప్రాయముకంటె భిన్నముగా నున్నవి. ప్రజలు లోపలనుండి పుట్టుకొవచ్చిన ఉత్సాహావేశములవల్ల తిరగబడుట మంచిదే. కాని వారిలో కొందరు లేదా అనేకులు దౌర్జన్యమునకు గడంగియుండుట అనర్థదాయకము. శ్రీ కిశోరిలాల్ మష్రువాలా, కాకాసాహేబు మున్నగు పర్కర్లు తాత్కాలికావేశ పరావశులై అహింసకు దుర్వ్యాఖ్యానము చేసినంత మాత్రముచేత అది అనర్థంకాదని చెప్పుటకు వీలులేదు. వారీ విధముగా దుర్వ్యాఖ్యానము గావించుటవల్ల అహింస ఎంత సునిశితమైన అస్త్రమో స్పష్టమగుచున్నది. ఏవ్యక్తిపైనను నిందమోపు ఉద్దేశముతో నేనీపై నిదర్శములుచూపి యుండలేదు. ప్రతివాడు తనకు ఉత్తమమని తలచినట్లు చేసెను. కట్టుదిట్టమైన దౌర్జన్యము

తమ్ము వెలుపలవలె ముందివేయ జూచుచున్నప్పుడు ఊర కుండుట భీరుత్వ మనిపించుకొనెడిది. 1942 వ॥వు సంఘట నలవిషయమై నా అభిప్రాయము తెలుపమనినయెడల బలహీ-నత చూపినవాడ నగుదును. తప్పుచేసినవాడ నగుదును.

## ప్రతిఘటనకై అందరిని ఏకము చేయుట

రాజ్యాంగ రంగమునందుగాక ప్రతిఘటన రంగము నందు హిందువులను, మహమ్మదీయులను ఏకముచేయుట తన అభిమతమైనట్లు అరుణ చెప్పుచున్నది. దౌర్జన్యసహిత ప్రతి ఘటన దృశ్యా విచారించినను, ఇది ప్రజలను తప్పుదోవలో పెట్టినదైయున్నది. ప్రతిఘటనగావించు పట్టున అందరు త్రిక రణశుద్ధిగా ఏకమగు నెడల రాజ్యాంగ రంగమందుకూడ అంద రుఏకముగావలసియుండెడిది. పోరాడువారెల్లప్పుడు శత్రువు నెదుర్కొనుటకు కట్టిన అడ్డంకివద్ద జీవింపరు. ఈఅడ్డంకివద్ద నుండి వారు రాజ్యాంగరంగమునకు వెళ్ళవలసియున్నది. సార్వకాలికంగా ఈరాజ్యాంగరంగమును నిషేధింప వీలులేదు.

## దూరదృష్టి విరహితము

బ్రిటిషువారి ప్రకటనవలన నమ్మకుండా ముందుగానే కయ్యమునకు కాలుదువ్వుట దూరదృష్టి విరహితమనుట నిశ్చ

యము. ఒక గొప్ప జాతిని మోసపుచ్చుటకు బ్రిటిషు అధి
కార రాయబారము వచ్చుచున్నదా? మోసపుచ్చుటకు
వచ్చుచున్నదని తలచుట మానుషంగా లేదు. వేచియుండుట
వల్ల నష్టమేమి? బ్రిటీషువారి ప్రకటనలు విశ్వసనీయములు
కావని ఆఖరితడవ బ్రిటిషుమంత్రిల రాయబారము ఋజువు
చేయనిండు. విశ్వసించుటవలన భారతజాతికి లాభముకల్గును.
మోసపోయినవారు ఋజువుగా ప్రవర్తించిన ఎడల మోసపు
చ్చినవాడే నష్టపడును.

వాస్తవిక విషయములను మన మెదుర్కొన వలయును.
రాబోవు రాయబారవర్గము మిత్రభావమున వచ్చుచున్నట్లు
చెప్పుచున్నారు. భారతదేశవిముక్తికై రాజ్యాంగసమ్మతమగు
పద్ధతిని కనుగొను ఉద్దేశముతో వచ్చుచున్నట్లు చెప్పుచు
న్నారు. సమస్య అత్యంతక్లిష్టమైనది. ఇంతక్లిష్టమైన సమస్య
ఎప్పుడు రాజ్యాంగవేత్తల నెదుర్కొని యుండలేదు. విపరీత
మైనట్టియు, సాధింపవీలు లేనట్టి ఒకమార్గము. వారు సూచిం
పవచ్చును. అది వారికే నష్టము. తాముకల్పించుకొన్న చిక్కు
లనుండి బయటపడుటకు సరియైనమార్గము నొకదానిని కను
గొనువారు కృతనిశ్చయులై యున్నయెడల ఒకమార్గమున్న
దనుట నిస్సంశయము. కాని భారతజాతికూడా తగినట్లుగా
తనపాత్రను నిర్వహించవలెను. అట్లయినయెడల ప్రతిఘటనకై
కట్టినఅడ్డంగిని తాత్కాలికముగానైనను తొలగింపవలయును.
ధైర్యసాహసములవల్లను, త్యాగమువల్లను తమకు లభించిన

శక్తిని అరుణాసఫాలీగారున్నా, ఆమె మిత్రులున్నా వివేకం తో ఉపయోగించవలెనని కోరుచున్నాను.

# నాయకుల తిరుగుబాటు

లొంగిపోవలసినదని సర్దారుపటేలుయిచ్చిన సలహాను నాయకులంగీకరించుట సంతసము కలిగించుచున్నది. తమ గౌరవమును వారు ఆహుతిచేయలేదు. నేను తెలిసికొనగల్గినంతవరకు తప్పుసలహా ననుసరించి వారు తిరుగుబాటు చేసిరి. తిరుగుబాటుచేయుట తమకష్టములను తొలగించుకొనుటకే అయినయెడల తాముకోరుకున్న రాజకీయనాయకులు సలహా నిచ్చునంతవరకు సౌఖ్యముకలిగించు కొనునంతవరకు వారువేచియుండవలసినది. భారతస్వాతంత్ర్యము కొరకేవారు తిరుగుబాటుచేసి యుండినయెడల సదిమరింతతప్పు, సిద్ధముగానున్న ఒకవిప్లవపక్షముయొక్క పిలుపులేనిదే హారట్టు చేసియుండ గూడదు. తమబలమువల్ల భారతదేశము విదేశాధికారము నుండి తప్పింపవీలగునని నమ్మియుండినచో వారు అనాలోచితముగా జ్ఞానశూన్యతతో వ్యవహరించిరి.

పోరాడినవారు ఈమారు యిదివరకెన్నడు చూపి యుండని పట్టుదల చూపిరని అరుణాసఫాలీ చూపిన మాట నిజమే. కాని కాలముగాని కాలములో జరిగినప్పుడున్నా, ఆత్మహత్యగా పరిణమించునప్పుడు ఈపట్టుదల పిచ్చి సాహస మని చెప్పవలసియున్నది.

ఈ తిరుగుబాటు కాలముగాని కాలములో జరిగెననుట ఆత్మహత్యగా పరిణమించినదనుట నిశ్చయము.

దార్జన్యము ధర్మమా! దార్జన్యరాహిత్యము ధర్మమా! అను విషయమె ప్రజలకు ప్రశక్తి లేనిదని చెప్పు హక్కు ఆమెకు గలదు. కాని జనసామాన్యమునకు స్వాతంత్ర్యము చేకూర్చు మార్గమును తెలుసుకొనుటలో ప్రసక్తిగలదు. ప్రజల ప్రవర్తనలో ఎన్ని లోపము లున్నప్పటికీ వారింత వరకు అహింసామార్గ మవలంబించియుండిరి. అహింసా మార్గమువల్ల శతాబ్దముల పర్యంతము పడియున్న నిద్రనుండి భారతదేశము మేల్కొన్నదా! లేదా! ఎంత అశ్రద్ధముగా మున్నప్పటికీ భారత ప్రజలలో స్వాతంత్ర్య తృష్ణ ఏర్పడి నదా! అని అరుణాసఫాలీ ప్రభృతులు మాటిమాటికీ ప్రశ్నించుకొనవలసి యున్నది. నా అభిప్రాయములో దీనికొరకే సమాధానము కలదు.

## అ రు ణా స ఫా లీ స మా ధా న ం

గాంధీగారు తిరుగుబాటు గావించిన భారతనావికులకు "మీకు అవమానము కలుగుచున్నఎడల రాజీనామా నొసంగుడు" అని యిచ్చిన సలహాను అరుణాసఫాలీ ఈవిధం గా విమర్శించింది.

"నావికులు రాజీనామా నిచ్చినఎడల వారి జీవనో పాధికిగల ఒకేఒకమార్గమును వారువదలుకొనవలసియుందురు. అదిగాక వారు సిద్ధాంతములకై పోరాడుచున్నారు. వారిప్పుడు రాజీనామా నిచ్చినయెడల నిరుద్యోగము ప్రబలి

యున్న ఈ రోజులలో వారి స్థానము నాక్రమించుటకు వందలకొలది ముందుకు వత్తురు. నావికుల స్థానము నాక్రమించిన వారియెడలగూడ యిప్పటి మాదిరిగానే విచక్షణ చూపుచుందురు. నావికులు సాధించిన దేమియు నుండదు. కాంగ్రెసువాదులు స్వయంగా తాము శాసన సభలకువెళ్ళుచు పనులు వదలిపెట్టవలసినదని నావికులను కోరుట సంభావ్యముగా లేదు. వారు రాజీనామా నిచ్చుటవల్ల దేశమున కెట్టి మేలూ చేకూరదు."

## గాంధీజీ సమాధానం

ఈ వాదమునకు గాంధీమహాత్ముడు హారిజన పత్రికలో "భావసంఘర్షణ" అను శీర్షికగల వ్యాసమునందు ఈ దిగువ సమాధానమును వ్రాసెను.

దౌర్జన్యరహిత కార్యాచరణ యందలి ప్రథమసూత్రము అవమానకరమగు ప్రతి దానితోను సహాయ నిరాకరణ గావింపవలెననుటయే. కీర్తిశేషులైన లాలా లజపతిరాయి అధ్యక్షతను కలకత్తాలో జరిగిన ప్రత్యేక కాంగ్రెసు మహాసభవారు ఒక తీర్మానముద్వారా ఈసిద్ధాంతమును నిర్వచించియుండిరి. పాలితుల లాభమునకై రాయల్ ఇండియను నావీ స్థాపింపబడియుండలేదని జ్ఞాపకము యుంచుకొనవలయును. అన్ని సంగతులు తెలిసియే వారీ నౌకాదళ

ములో చేరిరి. దానిలో విచక్షణ చూపబడుచున్నది. భారతదేశమును అస్వతంత్రముగా నుంచుటకు ఏర్పరుపబడిన ఈ నౌకాదళ ఉద్యోగములో ప్రవేశించినపుడల విచక్షణ తప్పదు. పరిస్థితులను చక్కజేయ ప్రయత్నింపవచ్చును. ప్రయత్నింపవలెనుకూడా—కాని పరిస్థితులను చక్కబరచు పని ఒక హద్దువరకు మాత్రమే సాధ్యమగును. తిరుగుబాటు ద్వారా దానిని సాధింప వీలులేదు. తిరుగుబాటు జయప్రద మగునని ఊహింపవచ్చును. కాని తిరుగుబాటువల్ల కలిగిన విజయము తిరుగబడిన వారికీ, వారిబంధువులకు మాత్రమే ప్రయోజనకరము కాని భారతదేశ మంతటికీ ప్రయోజనకరముగా నుండదు. ఇట్టి తిరుగుబాటువల్ల కలుగు అనర్థకము ముందు సంతతుల వారికి అనర్థకముగా పరిణమించును. క్రమశిక్షణ యిప్పుడెంత అవసరమో, స్వరాజ్యము వచ్చిన తర్వాతకూడా అంతే అవసరము. తిరుగుబాటువల్ల విజయము సాధించవారి కిందనుండు భారతదేశము పరస్పరము ఒందురులతో యుద్ధముచేసి ఈ అంతఃకలహములవల్లఅలసి పోయిన శక్తులుగా చీలిపోవును.

అవమానమునకు అనమ్మతి తెలుపు ఉద్యమము నను సరించి ప్రస్తుత కేటింగుయు రాజీనామా నిచ్చినయెడల, వందలకొలది వారి స్థానము ఆక్రమించు మాట నిజమే యైన యెడల కాంగ్రెసు ఏ జన సామాన్యమునకై పోరాడుచున్న

డో ఆ జన సామాన్యము స్వరాజ్య పోరాట తత్వమును గ్రహించుటలో ఒక్క అంగుళమైనను ముందుకు వెళ్లలేదని అర్థము. మనలో వందలకొలది అవమానమును దిగమ్రింగి అవమానింపబడిన సాటి భారతీయుల స్థానము నాక్రమింప సిద్ధముగా నుండునంత అధఃపతితులైనయెడల జన సామాన్యమునకు స్వరాజ్యము లభించునా! కాంగ్రెసువాదులు నహితము యిట్టి తలంపు కలిగియుండుట అనుచితము. అది యే స్వరాజ్యము చూపు మేరలోనున్నట్లు నమ్మబడుచున్న సమయమున యిట్టి తలంపు కేవలము అనుచితము. రాయలు ఇండియన్ నేవీలో పనిచేయుటొక్కటే వారి జీవనోపాధికి మార్గమను తలచువారు వారియెడల చాలా హీనమైన అభిప్రాయము గలవారై యుండవలెను. సైనికులు చాలా కష్టపడి పనిచేయుదురు. ఇతరులతో కలసి పనిచేయు శిక్షణము సైనికునికి నొసంగబడును. గడ్డపారతోను, పారతోను పనిచేయుటకు సైనికుడు తర్ఫీదు చేయబడును. ఇట్టివాడు సైనికుడుగా పనిచేయుట తన జీవనోపాధికి వేరు మార్గము లేదను భావము సైతము గర్హించును. సైనికులు కష్టపడి పనిచేసి, తమ చెమటనోడ్చి పనిచేసి పొట్టపోసుకొన జాలరని తలచునెడల వారి విషయమై మనము హీనమైన అభిప్రాయము కలిగియున్న వారమగుదుము. కష్టించు వాని కూలికేనాడూ లోటు రాదు. సైనికులకుండు మోజు తీరికొనసంగుబడు సౌకర్య

ములు వుండవనుట మాత్రము నిజము. ఇంతవరకు సైనిక ధర్మము పేరిట హత్యా నాశనకాండకున్న పూతను యిప్పటికైనా తుడిచిపారవేయక పోయినట్లయితే 25 సంవత్సరాలుగా మనం అహింస విషయంలో చేసిన కృషి వృధాయనే చెప్ప వలసియుంది.

రాజీనామా యిచ్చుటవల్ల రేటింగులు ఎట్టిలాభము పొంది యుండెడివారు కారని అరుణాసఫాలీగారు చెప్పినట్లు ప్రకటించబడినది. వారు ధైర్యంగా తమ ఉద్యోగములకు రాజీనామానిచ్చియుండిన యెడల వారికి గౌరవము, ప్రతిష్ట కలిగియుండెడిది. తమ గౌరవమును, ప్రతిష్ఠను నిలబెట్టుకొనుట ఎట్లో వారు బొంబాయి ప్రజలకు, నేర్పియుండెడివారు. బొంబాయి ప్రజలకు ఇట్టి యిక్కట్టు సంభవించకుండా వారుచేసియుండెడివారు. అవివేకవంతమైన ధన, ప్రాణనాశనమును అమూల్యమైన ఆహారపదార్థముల నాశము జరుగకుండ వారు చేసియుండెడివారు. మనము పరిగణింపదగినంత గొప్పపనే వారు సాధించియుండెడివారు.

కాంగ్రెసువారు న్యాయముగా శాసనసభలలోనికి ప్రవేశించుచు, నావికులను రాజీనామా నివ్వవలెనని కోరుట సంభావ్యము కాదని అరుణాసఫాలీగారనుచున్నారు. దేశము యొక్క గౌరవమును కాపాడుటకున్నూ, దేశమునకు స్వాతంత్ర్యము చేకూర్చుటకున్నూ కాంగ్రెసువాదులు శాసన సభ

లకు వెళ్లుచున్నారు. కాంగ్రెసువాదులు శాసనసభలలో ప్రవేశించుటయూ, రేటింగులు పనులలో నుండుటయు సమానము కాజాలవు. ఎందుకనగా ఈనావికులు తమజీవనమునకై నావికా దళములో చేరినారు. వారిదేశస్థులపైనను, వారిదేశ స్వాతంత్ర్యమునకు విరుద్ధముగాను వారిని ఉపయోగించుకొను అవకాశముకూడ కలదు. శాసనసభలలో ప్రవేశించు కాంగ్రెసువాదులు ఓటర్లచే ఎన్నుకొనబడిన ప్రతినిధులుగా వానిలోనికి వెళ్ళుదురు. ఓటర్ల అభిప్రాయమును వికృతముచేసి చెప్పువారు శాసనసభలలో ప్రవేశింపకుండ చేయుటకు కాంగ్రెసువాదులు శాసనసభలలోనికి వెళ్ళుచున్నారు. శాసనసభాప్రవేశము పూర్తిగా చెడ్డదికావచ్చును. కాని శాసనసభలలో ప్రవేశించువారికిని, నావికులకును పోలిక ఎంతమాత్రము సరియైనది కాదు.

అరుణ తన అభిప్రాయమును ధైర్యంగా వెల్లడించుటలో గాంధీమహాత్మునినైనను విమర్శించుటకు వెనుదీయదని పైఉత్తర ప్రత్యుత్తరములద్వారా తేటతెల్లమగుచున్నది.

ఒకసారి ఎవరో దంపతులు ఎం. ఆర్. మసానీగారి వద్దకువచ్చి తమపుత్రిక నామకరణోత్సవమునకు ఆహ్వానించగా, ఆబిడ్డకు ఈవీరనారి "అరుణ" పేరుపెడ్తే వచ్చెదననిరి.

అరుణాసఫాలీ నేడు ఒకప్రముఖ కాంగ్రెసు సోషలిస్టు నాయకురాలు. భారతీయయువకుల భవిష్యత్తును నిర్ణయించ

డంలో జయప్రకాశ నారాయణ్, అచ్యుతపట్వర్ధన్, రామ మనోహరలోహియా మొదలగు ప్రముఖులతో పాటు ఈమెకు కూడా తప్పక భాగం యుంటుంది.

ఈమె భర్త అసఫాలీ కాంగ్రెసు కార్యకలాపాలలో పేరన్నికగంటే, ఈమె కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో ప్రము ఖరాలుననిపించుకొంటోంది.

అరుణాసఫాలీ ఉపన్యాసాలు చాల ఉద్రేకపూర్వకం గాను, భావ గర్భితంగాను వుంటాయి. ఈ క్రిందివి కొన్ని మచ్చుతునకలు.

వార్ధాలో ఈమెకు ప్రజలు చేసిన సన్మానసభలో భారత దేశ గ్రామాన్ని గురించి యిలా ఉపన్యసించింది.

"క్విట్ ఇండియా" నినాద సాఫల్యానికి ఇదే తగిన సమయం. మనం క్షుద్బాధాసలానికి గురియై నశించాలి లేక, బ్రిటిష్ ప్రభుత్వంవారిక్రింద బానిసలుగా వుండిపోవాలి.

మీరు వీరులరీతిగా పోరాడి, వీరస్వర్గం అలంకరించ వలసిందేగాని, త్వరలో రానున్న గ్రామ పిశాచానికి బలికా కూడదు.

"మీరు పట్టణంలోనుంచిగాని, గ్రామంలో నుంచి గాని, ఒక్క ధాన్యపుగింజను బైటికి వెళ్లనివ్వకూడదు. పం చాయతులద్వారా వాటిని సక్రమంగా పంచాలి. మీరు గ్రామపిశాచం వాతబడకూడదు. మీనర్వ శక్తులను కేంద్రీక

కరించుకుని భారతమాత స్వాతంత్రసిద్ధికై పోరాడాలితిరిగి అప్టి, చిమూరు సంఘటనలు రాకుండాచెయ్యాడానికి ఒక్కటే సాధన, మొదట బ్రిటిష్‌సామ్రాజ్యతత్వంపై కడసారి దెబ్బ తీయడానికి జరిగే పోరాటానికి అందరూ సిద్ధపడాలిమన స్వాతంత్ర్యమే మనకు శరణ్యం.

"మనము హింసాయుతంగా చరించామా లేక అహింసాయుతంగా ప్రవర్తించామా అని ప్రశ్నించేఅధికారం రక్తారుణ హస్తమైన లార్డ్ వేవెల్ ప్రభుత్వానికి లేదు. అహింసా సిద్ధాంత వాదియైన మహాత్మునికే అది చెల్లుతుంది. నేడు క్షామదుస్థితి ఎదుర్కొన్నది కనుక, మనం ధాన్యాన్ని ప్రభుత్వోద్యోగులు సేకరించకుండా చూచి, గ్రామాలలో పంచాయితీల నేర్పరచి,ధాన్యం సక్రమంగా పంపకమ య్యేటట్లు చూడాలి. క్షామదేవతకు మానంగా బలికాకండి. నేడు మన నెదుర్కొనినది క్షామభయమా లేక అనంతంగా బ్రిటిషు దాస్యమా అనేసమస్య, స్వాతంత్ర్య సమరానికై సన్నద్ధులు కండి.

ఈ గౌరవం నాకుకాదు: అచ్యుత్, జయప్రకాష్ ప్రభృతులది. బ్రిటిషు దమననీతికి బలియైపోయిన ఆగస్టు వీరులకే ఈ గౌరవం చెందుతుంది. దారుణ కృత్యాలు దేశంలో జరుగకుండా వుండాలంటే, స్వాతంత్ర్యం సిద్ధించే వరకు విశ్రాంతి నెరుగని దీక్షబూనాలి వీరుల స్మృతికై

చిహ్నాలకు నిర్మించి, ప్రభుత్వంతో కయ్యానికి కాలుదువ్వ
డంకంటె, స్వాతంత్ర్య నమరానికి సన్నద్ధులమై, బ్రిటిషు
వారిని వెళ్ళగొట్టడానికి ప్రయత్నించాలి.

"క్విట్ ఇండియా" నినాద మిచ్చిన పిదనికి నా ప్రవా
నచర్యలను నివేదించుకోడానికి వచ్చాను. 1942 ఆగస్టులో
ప్రభుత్వం నాయకులను అరెస్టుచేసిన కారణాన, దేశంలో
వీరావేశం పెల్లుబికింది.

గాంధీజీ అహింసా సిద్ధాంతాన్ని మనం పూర్తిగా
అర్థంచేసుకునివుంటే, ఈసరికి స్వాతంత్ర్యం పొందేవారమే
ఆగాఖాన్ భవనంలో గాంధీజీ నిరసనవ్రతం సాగిస్తుంటే,
మన మేమి చేయగలిగాము?

ఎన్నికలు మనకు స్వారాజ్యము నివ్వవు, భావి నమరా
నికి సిద్ధంకండి.

బెంగాల్‌లో 35 లక్షలమంది క్షామదేవతకు బలియై
నారు, తిరిగి క్షామం వస్తున్నది పెక్కుమంది చనిపోవచ్చు

క్షామ ప్రమాదభయం వున్నప్పటికీ, బ్రిటిష్‌వారిని
వెళ్ళగొట్టడానికి గాంధీజీ "క్విట్ ఇండియా" ఆదేశాన్ని
నఫలం చేసేందుకై మీ సర్వశక్తులను నమీకరించుటకును
సిద్ధముగా ఉండండి.

మనం బ్రిటిషువస్తువులను బహిష్కరించాలి త్వరలోనే
బ్రిటన్‌లో కార్మికఅభ్యుదయాన్ని ఆశించి తన వస్తువులను

బ్రిటిష్ మనపై రుద్దజూస్తుంది. మనం వాటిని బహిష్కరిస్తే, బ్రిటన్ కాళ్ళ బేరానికి వస్తుంది.

## గాంధీజీ సూక్తి

ధాన్యాన్ని ప్రభుత్వోద్యోగుల వశపరచరాదని, బ్రిటిషు వస్తువులను బహిష్కరించాలని అరుణ చేసిన సూచనలకు గాంధీజీ అంగీకరించాడట.

ఆగస్టు విప్లవసందర్భంలో గాంధీజీ, అరుణల దృక్పథాలు కలిసినట్లున్నది.

గాంధీజీ ఇలా చెప్పాడట—

"అమ్మా! స్వాతంత్ర్యలబ్ధికి ప్రపంచ శాంతి భద్రతలకు అహింస ఉత్కృష్టసాధనమని నీవు నాతో ఒకనాడు అంగీకరించగలవు.

## పూనాలో అరుణాసలీ యిచ్చిన ఉపన్యాసం

1942వ చరిత్ర మన స్వాతంత్ర్య పోరాట చరిత్రయైయున్నది మన చరిత్రలో నది ఉజ్వలమైన ఘట్టము. కడుంగడు చరిత్రాత్మకమగు ఆరోజులలో భారతప్రజల హృదయములందు ప్రజ్వలించిన అగ్నిని మనము చల్లార నివ్వరాదు. ఆ యగ్నిని మనము మరల రగుల్కొల్పి మరియొక పోరాటమును, ఇది

వరకు దానికంటే తీవ్రమైన పోరాటమును సాగింపవలసియు న్నది. ఇట్టి పోరాటము లేనిది భారతదేశమునకు స్వాతంత్ర్యము సిద్ధింపదు'.

అరుణ అసఫాలీ ఆగష్టు విప్లవ నాయకమణులలో నొక్కతెయని, ఆసేతు హిమాచలపర్యంతము ప్రజలలో వ్యాపించియున్న పోరాట తత్వమునకు ఆమె చిహ్నమని చెప్పుచు సభాధ్యక్షులు రా॥ సా॥ పట్వర్థన్ గారు ఆమెను సభికుల కెరుకపరిచిరి.

మరియొక పోరాటము అవసరమని కాంగ్రెస్ మహాసభాధ్యక్షుడు నొక్కి చెప్పినందుకు అరుణ అసఫాలీ సంతసించెను. 'కేంద్ర ఎసెంబ్లీలో ప్రజా ప్రజనిధులతో కూడిన కార్యవర్గము నేర్పరుపవలెనని మహాత్ముడు గావించిన సూచనను సైతము బ్రిటిషు ప్రభుత్వము వారంగీకరింపనందుకు నేను సంతసించుచున్నాను. మరియొక పోరాటమును, ఇదివరకు కంటె తీవ్రపోరాటమును మనము ప్రారంభింపవలసి యుండునని అది ఋజువు చేయుచున్నది. బొంబాయి, కలకత్తా మున్నగు ప్రదేశములయందలి కాల్పులు రాబోవు స్వాతంత్ర్యమునకు సూచనలు. కావు. జన సామాన్యముయొక్క అశాంతికి, నిరంకుశ ప్రభుత్వము వారి మూర్ఖత్వమునకు అవి చిహ్నములు.

మరియొక పోరాటము ఇదివరకుకంటె గొప్పది, తీవ్రమైనది జరుగవలసి యుండునని చెప్పుచు దానికి సిద్ధమగుటకు

బ్రిటిషు వస్త్రములను బహిష్కరింపవలెనని ప్రతి గ్రామములో, ప్రతి పట్టణములో అజాద్ ఫౌజు నేర్పరుపవలెనని చెప్పెను, కాంగ్రెసు ఆదేశ మీయనంగగానే ఆగస్టు ఉద్యమములో పాల్గొన్న తాము పోరాటము సాగింప సిద్ధముగానుండిరని ఆమె చెప్పెను.

## ఆసఫాలీ

అరుణకు ఆదిలో స్వాతంత్ర్యమంత్రము నుపదేశించిన వ్యక్తి ఆసఫాలీ ఈయన సెంట్రల్ అసెంబ్లీసభ్యులు ఢిల్లీ హిందూముస్లిం నియోజక వర్గంనుండి అధిక ఓట్లతో ఎన్నుకోబడ్డారు. అజాద్ హిందు ఫౌజు సైనికులను ప్రభుత్వము రాజద్రోహనేరంక్రింద విచారిస్తున్న సమయంలో, కాంగ్రెసు బూలాభాయి దేశాయి, పండిత జవహార్లాలు నెహూ్రతో బాటుఅసఫాలీనికూడా, ఢిఫెన్సుతరపున వాదించుటకు ఏర్పాటుజేసింది. తుదకుఆవిచారణలో తమవాదనాశక్తివల్ల విజయమందగలిగారు.

తర్వాత దక్షిణదేశపు కాంగ్రెసురాజకీయాలు ఆగస్టు విప్లవానంతరము అల్లకల్లోలమవగా, కాంగ్రెసు వర్కింగు కమిటీ అసఫాలీని శాంతిదూతగా నియమించి, మద్రాసు పంపింది. దక్షిణదేశపు తగాయిదాలకల్లా మూలం, మద్రాసు మాజీపధ్రాని శ్రీ సి. రాజగోపాలాచారిగారు ఆగస్టు విప్లవాన్ని వెన్నుపోటు పొడుచుటయేగాక, కాంగ్రెసు సిద్ధాం

కీలతా మానం తెచ్చాడని ప్రజలఆందోళన. అసఫాలీగారు మద్రాసులో యిచ్చిన ఉపన్యాసం గమనించదగ్గది.

"దేశం ముఖ్యంగాని, ఎవరో కొందరు వ్యక్తులుకాదు. ప్రజలు ముఖ్యంగానిఎవరోకొందఱు ప్రముఖులుగారు. దేశంయోగక్షే మాలే ప్రజలయోగక్షేమాలేమనం నంతతంపరిగణించదగినట్టివి. ప్రజలరక్తమే, వారికలలే, వారికోర్కెలే కాంగ్రెసు. నేనిక్కడికి వచ్చింది ప్రకాశంగారి కోసంగాని, రాజగోపాలాచారిగారి కోసంగాని, ఏఇతర ప్రముఖుని కోసంగానిగాదు. నేను మీ అందరికోసమే యిక్కడికి వచ్చింది. ప్రజల యోగక్షేమాల తోనే, భారతదేశం యోగక్షేమాలతోనే నాకుసంబంధం.

ఈధోరణిలో అసఫాలీప్రజల నుద్దేశించి చెప్పినా, అసఫాలీలోనున్న సహజమైన కవిత్వధోరణికూడా పైఉపన్యాసభాగంలో కొద్దిగా కానవస్తోంది.

అరుణకువలెనే అసఫాలీకూడా మనస్సులోనున్నది నిర్భయంగా చెప్పగలుగువ్యక్తి.

1946 జనవరి 28 వ తేదీని వైశ్రాయి భారతశాసన సభలో దేశభవిష్యత్తునుగురించి ఉపన్యాసంపై అసఫాలీ "సదుద్దేశం చాలదు— చేతలుకావాలి" అని తన అభిప్రాయమును వెంటనే ప్రకటించెను.

అసఫాలీని ఆగస్టు ఉద్యమంలో ప్రభుత్వం తీసుకొని పోయి ఆజాద్, నెహ్రూ, పటేలు మున్నగు నాయకులతో

పాటు అహమ్మదునగరకోటలో బంధించెను. విడుదలైకారా గారమునుండి బయటకు వచ్చునప్పటికి ఆరోగ్యము పూర్తిగా కోలుపోయెను. ఈఅనారోగ్యకారణం మూలంగానే ఆయ నను ప్రభుత్వంవిడుదలచేసా.

అసఫాలీ నేటికాంగ్రెసు రాజకీయరంగంలో ఒకప్రధా సూత్రధారుడు కాగలైను. అసఫాలీ అరుణను పరిణయమాడి నందుకు ఆతనికీర్తి మరింత హెచ్చునేగాని తగ్గలేదు.

ఈదంపతు లిరువురిదాంపత్యములోను హిందూముస్లిం సఖ్యత మూర్తీభవించుచున్నదని చెప్పవచ్చును.

అసఫాలీజననం 1888 సంవత్సరములో. ఢిల్లీలోవిద్యా భ్యాసమంది ఇంగ్లండువెళ్ళి బారిస్టరై యిండియాకు వచ్చెను. ఈయన న్యాయవాద వృత్తిలోని వాదనలకంటె రాజకీయ ఉపన్యాసాలే చాల గంభీరంగాయుంటవి. సెంట్రలుఅసెంబ్లీలో మిలిటరీ సమస్యలపై ఎక్కువగామాటలాడుతూ యుంటారు. రాంఘరు కాంగ్రెసులో కాంగ్రెసు అధ్యక్షుడు మౌలానా కలాం అజద్, అసఫాలీని 'వర్కింగుకమిటీ సభ్యుడుగా తీసు కొనెను. అజాద్ ఆత్మీయులలో అసఫాలీ ఒకడు. 1942 ఏప్రి యల్ లో క్రిప్సురాయబార సమయంలో అసఫాలీ మౌలానా అజాద్‌కు ద్విభాషిగా పనిచేసెను.

అసఫాలీ జైలునుండి విడుదలైన తర్వాత చికిత్సకొ రకై కలకటా వెళ్ళెను. ఇక్కడొక విచిత్రం జరిగింది. అస ఫాలీ అనారోగ్యంతో బాధపడుచున్నా, సి. ఐ. డీ. లు ఈయ

నను వెన్నంటుతూనేయున్నారు. యుద్ధుదొరకని కరువుకా
లంలోకూడా అసఫాలీ బసప్రక్కనే సి. ఐ. డి. ఒకయిల్లు
సంపాదించి ఎల్లప్పుడు ఆయనను కాచుచుండెడివాడు. ఇంత
కూను ఆ సి. ఐ. డి. భయం అసఫాలీని గురించికాదు. అస
ఫాలీ భార్య అరుణ ఏదో ఒకసమయంలో ఆయనను చూచు
టకు వచ్చునప్పుడు ఆమెను పట్టవచ్చును గదాయని, అరుణ
అంత వెర్రిదా — ఈ తెలివితక్కువ సి. ఐ. డీ కి దొరుకుటకు!

అసఫాలీ అసలే మనశ్శాంతిలేక అనారోగ్యంతో బాధ
పడుతున్న సమయంలో ఈ శనిగొట్టు సి. ఐ. డి. బాధ అత
నిని మరింత బాధపెట్టడం మొదలుపెట్టింది.

అరుణ ఏమైందో — నిజంగా చనిపోయిందేమోననే
అనుమానంతోనున్నాడు. అసఫాలీ జైలునుంచి బయటకు
వచ్చుసరికి "గత తొమ్మిది మాసాలనుండి నేను పూర్తిగా
దుర్బలుడనై పోయాను. అనేకసార్లు ప్రాణంపోయే పరిస్థితులు
కూడా ఆసన్నమైనాయి. కాని అరుణను చూడవలెనని
నాహృదయం తహతహలాడి పోయింది. మరల ఆమెనుచూచే
భాగ్యం ఈజన్మలో నాకు లభిస్తుందా!— ఆమెవల్ల దేశానికి
ప్రయోజనమూ, ప్రజలకు చైతన్యము లభిస్తుంటే, ఎట్టి
కష్టాలనైనా ఎదుర్కొనడానికి సంసిద్ధుడనే." అని కలవరించ
సాగాడు అసఫాలీ తన జబ్బులో.

అసఫాలీ అరుణను తన అదృష్టంకొలదీ దొరికిన ఒక
ఆరాధ్యదేవతలా చూచుకొనేవాడు. ఇది అరుణయే అంగీక

రించింది. అప్పుడప్పుడు అరుణ తన భర్తనుగురించి "అన ఫాలీవంటి ఔదార్యము, దయగల సద్గుణవంతులగు భర్తలు చాలా అరుదుగా వుంటారు...నిజానికి అతనివంటి విశాల హృదయులు వుండబోరు" అని అంటూండేది.

అరుణ దేశంలో రాజకీయ నాయకు రాలుగాను గృహంలో అనఫాలీ సహధర్మచారిణిగాను మెలగుతూ యుం డేది. అనఫాలీని వివాహమాడిన చాల కాలంవరకు అరుణకు ఉర్దూ రాలేదు. అనఫాలీ స్నేహితుడు ఫరీద్అన్సారీ ఒక సారి అరుణతో యిలా అన్నాడు. "అనఫాలీ నీమీద వం దలకొలదీ పద్యాలు, కవిత్వంలో వ్రాస్తున్నాడు. వాటిలోని మధురం గ్రోలడానికి, నీవు ఆపద్యాలు చదివి ఆనందించలేక పోతున్నావు. నీవుకూడా ఎప్పుడు ఉర్దూ, పర్షియను బాషలు నేర్చుకొని, ఆ ఆనందాన్ని అనుభవించ గల్గుతావో!" అన్నాడు అరుణను. ఫరీద్ అన్సారీ యిలా చెప్పడం అవ మానంగా తలచి, వెంటనే, తన అత్తగారి సహాయంతో అరుణ ఉర్దుబాష కొన్నిరోజులలోనే నేర్చుకొంది.

అనఫాలీ అంతకు పూర్వం రాజకీయరంగంలో తరచు కనబడినా, వివాహమైన తర్వాతమాత్రం చాల కాలంవరకు రాజకీయాలలో అతనిమాట వినిపించలేదు. మరల 1930 ఉప్పు సత్యాగ్రహంలో అనఫాలీ జైలుకు వెళ్ళినప్పటినుండి, అరుణ ఢిల్లీ రాజకీయాలలోను, అనఫాలీ దేశీయ రాజకీయా

లలోను తరచు కనబడ్తూ వచ్చారు. అరుణ 1950 సత్సాంగ్ర హంవరకు భర్తవద్ద ఎంతో విజ్ఞానాన్ని సంపాదించింది. మహిళాసంఘాలలో ప్రముఖపాత్రను నిర్వహించింది. ఢిల్లీలో చాలమంది ప్రముఖుల సహాయంతో, స్త్రీలకు "ఇర్విన్ కాలేజీ" నొకదానిని స్థాపించింది.

అరుణ, అసఫాలీల జీవితం ఒక మాధుర్యమైన ఆనంద మయజీవితం. ఇరువుర కిరువురే ప్రేమమూర్తులు. వారి వివాహం యిరుపక్షాల బంధువులు బయలుదేరి నిర్ణయించినది కాదు. వారి అన్యోన్య దాంపత్యంలో కష్టసుఖాలు, లాభ నష్టాలు సమానం. ఆ ప్రేమమూర్తు లిరువురూ కలసి, ప్రేమకు వయస్సుతోను, జాతి, మత, కుల విచక్షణలతోను సంబంధ మేమాత్రము లేదని, నిరూపించి ప్రపంచానికొక నూతన సందేశాన్నిచ్చారు.

ప్రేమించుకొన్నవారిలో చాలమందికి వివాహాలు చేసుకొనడాని కవకాశాలు లేక తమ జీవితాలను దుఃఖమయం చేసుకొంటారు. వివాహం చేసుకొన్నవారిలో ప్రేమానురాగాలు చీలికలు తీయడంతో మరికొందరు తమ జీవిత సుఖాన్ని పోగొట్టుకుంటున్నారు. కులం వేరైనా, మతం వేరైనా, భాషవేరైనా, సంస్కృతివేరైనా, అన్నీ కలసి సమకూర్చినట్లుగా "ప్రేమ" యనే పవిత్ర అక్షరాలు రెండూ అరుణ—అసఫాలీ లిరువురిలో మూర్తీభవించి సాఫల్యత నొందాయి.

అసఫాలీ రాజకీయ ఉపన్యాసాలు చాలా గంభీరంగా యుంటాయి. అసఫాలీ మద్రాసు వచ్చినప్పుడు "అజాద్ హిందుఫౌజ్—దాని నిర్మాణము"ను గురించి యిలా ఉపన్యసించాడు.

అజాద్ హింద్ ఫౌజ్ చరిత్రను సంగ్రహంగా వివరిస్తూ, శ్రీ బులాబాయ్ దేశాయి ప్రతిభా పూర్వకపు వాదాన్ని అనేకులు చదివివున్నప్పటికి అది చాలదని అసలు జరిగిన సంగతి ఇది అని చెబుతూ ఇలా అన్నాడు.

యుద్ధం జరగడానికి ముందు తమ ఆమోదం లేనిదే ప్రభుత్వం భారతీయ సైన్యాలను పోరాటానికి విదేశాలకు పంపరాదని అసెంబ్లీలోని ప్రజా ప్రతినిధులు వాదించిన విషయం మీకు జ్ఞప్తివుండవచ్చు.

అంతేకాదు. భారతీయ సైన్యాలను జాతీయంచేస్తూ, అవి దేనికోసం తమ అసువులను ప్రథనభూమికి ధారదత్తం చెయ్యాలో ఆ కారణాలను వివరించవలసినదిగా ఆందోళన చేస్తూ పెద్ద ఉద్యమం ప్రారంభించాము.

అయితే అసెంబ్లీలో ప్రజాప్రతినిధులు చేసిన ప్రయత్నాలుగాని, ఆందోళనగాని ఏదీ ఫలించలేదు. భారత దేశపు రక్షకులు దుర్బలంగా వున్నప్పటికి ఇండియా ప్రభుత్వం తమ యజమానులైన బ్రిటిష్ ప్రభుత్వాధికారుల ఉత్తరువు ప్రకారం యుద్ధానికి పూర్వమే నిర్ణయించబడిన విధానాలను అనుసరించసాగింది.

ఈ విధానాలు భారత దేశాభ్యుదయానికి కేవలం విరుద్ధమైనట్టివి.

ఇలా వుండగా 1939 లో భారతీయ సైనికులు పంప బడ్డారని ఒకనాడు అకస్మాత్తుగా తెలిసింది. అసెంబ్లీనుంచి మేమంతా వెళ్ళిపోయాం. విదేశాలకు పంపబడిన భారతీయ సైనికులు శిక్షణగాని, అనుభవం లేనివారు.

## భారతీయ సైనికులకు శిక్షణ

ఈ సైనికులందరిని మలయాకు పంపించారు. సునిశిత మైన శిక్షణ ఇచ్చారు. తిరోగమనం కోసమే ఈ శిక్షణ (మార్గం) ఇది మార్గించదగిన విషయం కాదు. మహా విచార కరమైన సంఘటన.

జపాన్, బ్రిటన్, అమెరికాలపై ప్రకటించడంతో, మలయాలోనేమి, సయాంలోనేమి వున్న భారతీయ సైనికులు తమకంటె అనేక రెట్లు అధికారంగావున్న జపానీస్ సైనికు లచే చుట్టివేయబడినామని గ్రహించి, తిరోగమనం సాగిం చారు."

సింగపూర్ పతనాన్ని మిష్టర్ అసఫాలీ వివరిస్తూ, భారతీయ సైనికులు ఒక గొర్రెల లేక పశువుల మందమాది రిగా జపాన్ సేనానికి ఒప్పగించబడ్డారని అన్నారు.

అప్పటినుండి వారు జపాన్ వారికి ఖైదీలనీ, జపానువారి

పుత్రరుషులను పాలించాలనీ భారతీయ సైనికులకు తెలియ జేయబడినది.

సింగపూర్ పతనానికి కొన్ని రోజులకు పూర్వం(1942 ఫిబ్రవరి 15) కెప్టెన్ మోహన్‌సింగ్ ముందుకువచ్చి మొదటి అజాద్ హింద్‌ఫౌజ్‌ను ఏర్పాటు చేశాడు. ఈ సైన్యంలో హిందువులు, ముస్లిములు, సిక్కులు వున్నారు 1857 లోని ప్లాసీ యుద్ధానంతర ఇటువంటి సైన్యం ఏర్పాటు కావడానికి ఇదే తొలిసారి. ఇది భారతదేశ స్వాతంత్ర్యాన్ని సాధించ డంకోసమే ఏర్పాటు చెయ్యబడుతున్నదని, భారత స్వాతం త్ర్యంకోసమే ఈ సైన్యం పోరాడుతుందని, ఏ విధాన జపా నీస్ చేతిలో కీలుబొమ్మ సైన్యంగా వుండబోదని స్పష్టీకరించ బడినది.

గత 3,000 ఏళ్ళనుంచి భారతదేశం ఎదుర్కొంటూ వచ్చిన దౌర్భాగ్య స్థితిని మీకు ఒకసారి జ్ఞాపకం చేస్తాను. తమ్ము ఎవరో విదేశీయులు పీడిస్తున్నారని తోచినప్పుడల్లా, వారిని వెళ్ళగొట్టడానికి భారతీయులు విదేశీయుల సాహాయ్యానిం చేవారు. దేశంలో తిష్ఠవేసుకొన్న విదేశీయులను వెళ్ళగొట్టి, కొత్తగా సాయంచేయడానికి వచ్చిన విదేశీయులు తమనుమట్టుకు తాము అధికారం చెలాయిస్తూ ప్రజాపీడన సాగించేవారు.

కనుకనే ఏ పరిస్థితిలోను మన స్వాతంత్ర్య సంపాదనకై విదేశీయులపై మనం ఆధారపడరాదని హెచ్చరిస్తున్నాను.

ఈ విషయాన్ని కాంగ్రెస్ ఇదివరలోనే స్పష్టీకరించింది. మన స్వశక్తితోనే మనం విముక్తిని సాధించాలి.

మన స్వాతంత్ర్యాన్ని మనమే సాధించేపాటి శక్తి నైనా మనం ఆర్జించాలి. లేదా మన స్వాతంత్ర్యాన్నిగురించిన తలంపునైనా విడిచిపెట్టాలి. మన విముక్తికి సాయపడే విదేశీయులెవ్వరూ. మన స్వాతంత్ర్యానుభవానికి అవకాశమీయరు.

అజాద్ హింద్‌ఫౌజ్ చరిత్ర త్వరలోనే భారతదేశ చరిత్రలో ఒకభాగం కాగలదు కనుకనే, తాను ఈ హెచ్చరిక ను చెయ్యవలసివచ్చినది.

ఆ తర్వాత ఆయన అజాద్ హింద్ ఫౌజ్ ప్రథమ సైన్యం రద్దుఅయిన పరిస్థితులను చర్చించాడు.

మొదటి సైన్యం రద్దు అయిపోయిన కొన్ని మాసాల తర్వాత శ్రీ సుభాష్ చంద్రబోసు నాయకత్వాన రెండవ అజాద్ హింద్ ఫౌజ్ ఏర్పాటు చెయ్యబడినదని, ఈ సైన్యం ఆధునిక యుద్ధ నిబంధనల ననుసరించి పోరాడడానికి నిర్దేశించబడినదని మిస్టర్ అసఫాలీ అన్నాడు.

అప్పట్లో ఈ సైన్యంలో 40.000 మంది సైనికులుండేవారని, వీరిలో 22,000 మంది యుద్ధఖైదీలనీ, మిగిలినవారు పౌరులని ఆయన అన్నాడు.

# ఆజాద్ హింద్ ఫౌజ్ లక్ష్యం

మిస్టర్ అసఫ్ ఆలీ ఆజాద్ హింద్ ఫౌజ్ లక్ష్యాన్ని గురించి ప్రసంగిస్తూ ఇలా అన్నాడు:

జాతి, మత, వర్గ వివక్షతలు లేకుండా వర్తించగలగడమే ఆజాద్ హింద్ ఫౌజులోని సువాత్ర విశేషం. మాతృదేశ స్వాతంత్ర్యసాధనమే తమ ఏకైక లక్ష్యంగా వీరు భావించారు.

ఈనాడు ఇక్కడకువచ్చిన బోసువీరులు ప్రభుత్వంచే సైన్యనుండి విడుదల చేయబడినవారు. సైన్యంలో వుంచడానికి వీలులేనివారని ప్రభుత్వం నిర్ణయించినవారు తమ స్వస్థానాలు చేరుకోవడానికి రైలుఖర్చులు మాత్రమే ఇవ్వబడినవి. ఆ పైన మరేమీ ఈయబడలేదు. కనుకనే వీరికి సహాయం అవసరమౌతున్నది.

"కాంగ్రెస్ అనేక ప్రధాన సమస్యలను ఎదుర్కొనవలసివున్నది. సైన్యంనుంచి విడుదలపొందే ఒక లక్షమంది సైనికులగురించి యుద్ధప్రయత్నల్లోంచి విడుదలచెయ్యబడే 50, లేక 60 లక్షల కార్మికుల సంగతి కాంగ్రెసు యోచించవలసివుంది.

---

శ్రీనివాసాప్రెస్, రాజమండ్రి. 1-10-46 కా. 1000లు.

# శ్రీ ప్రకాశం

రచయిత:- మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రిగారు

ఇదిచూడటానికి చిన్నపుస్తకంలాకనిపించినా ఇప్పట్లో మద్రాసు ప్రధాని హయాంలోవుండటం తప్ప ఆంధ్ర కేసరి చరిత్రంతా విపులంగా చర్చింపబడిందని చదువరులు తెలుసుకుంటారు. చిన్నతనములో అల్లరిచిల్లరిగా తిరిగి వ్యక్తి ఇంతయభివృద్ధి నొందుతాడనడానికి, నాటకాల్లో వేషాలువేసి కళాభిమానం కలవాడైనా ఒక్కొక్కవ్యక్తి రాజకీయాలలోగుడా యఖండమేధాశక్తి కలవాడౌతాడనడానికి శ్రీ ప్రకాశం గారిజీవితమే గొప్పతార్కాణం. అంతతోసరిపోయిందా ? అర్ధణా చేతిలో లేనిమనిషి ఆరువేల మైళ్ళ దూరానికి మించిన యింగ్లండుకు పోయి బారిస్టరై, ఏఅవకతవక గుణాలు పట్టుబడకుండా వచ్చి లక్షలార్జించి పెద్ద పెద్ద భవనాలు కట్టి చివరదశలో త్యాగిగా మారి ఈనాడు మూడుకోట్ల యాంధ్రుల బంగరుహారతులందుకునే జీవితమిది.

వెల రు 0—8—0